

శ్రీ గుండిమెడ వేంకటసుబ్బారావు,
గ్రంథకర్త.

చారక సమితి-ప్రచురము-



**( The Exit of Seeta )**




గ్రంథకర్త

శ్రీ గుండిమెడ వేంకట సుబ్బారావు

B. A., B. Ed.,

*Author of*

**Khilji Rajya Pathanam, etc.,**




**Re. 1—0—0.**

# కళాప్రచారక సమితి-బరంపురం
(స్థాపితము 1933)

"......సత్కావి కల్పనా విభూషావహ పూర్వ
వృత్తములు సానలదీరిన జాతిరత్నముల్ ......"

శ్రీరాముని కథనమున నే భాగ మెవరు రచియించినను చవులూరుగుణము ఆ మహాపురుషుని పవిత్ర చరిత్రమందే కలదగుట, పలువిధముల పలువురు రచియించుట కవకాశమిచ్చుచున్నది. అట్టి అవకాశమున రచియింప బడిన యీ పృథ్వీపుత్రిని కళాప్రచారక సమితి ప్రచురించు నవకాశము లభించినందున నీ సమితి కృతార్థమైనది; పృథ్వీపుత్రియు ధన్యతం గాంచినది; మా పాఠక మహాశయులకిట్టి యుద్గ్రంథము నేటికొసంగ గలిగినందుకు కళాప్రచారక సమితియు కృతకృత్యమైనది.

కేవల ప్రాచీన పద్ధతులు యువజనుల యుత్సాహమునకు భంగము కలిగించుచుండగా, కేవల నవీనమార్గములు యువజనుల యుత్సాహమును వ్యర్థము చేయుచున్నవి. సాహిత్య పరిషత్తువారి ఛందో వ్యాకరణాది నియమములు యువజనుల యుత్సాహమును జంపివైచుచున్నవి. ఆధునికుల యడ్డులేని ఛందో వ్యాకరణాది విహారములు వారియుత్సాహము లోకమునకు పనికిరాకుండ జేయుచున్నవి.

మహాప్రవాహమును గట్టుకట్టి యాపివైచినచో, అదిగట్లు త్రెంపుకొని పారుటయేకాక, ప్రక్కనున్న పల్లెలపైబడి పాడుచేయుచున్నది; కాని స్వేచ్ఛగా పోనిచ్చుచున్నచో, లోకమునకు పనికిరాక, అది వ్యర్థముగా సముద్రములో గలసిపోవుచున్నది. కావున, ప్రవాహము పారుచుండుట కడ్డులేకుండ, ఆనకట్లు కట్టినచో నీరు కావలసిన కాలువలలో ప్రవహించి, తన కార్యమును తానునిర్వర్తించుకొనుచు లోకము నుద్ధరించుచున్నది. యువజనుల మానసిక శక్తియు నిట్లే తగిన యానకట్టలు కట్టి ప్రవహింపజేసినచో, తన కానందమును గలిగించుకొనుచు, లోకము నుద్ధరింపగలదు. యువజనుల యీ యుత్సాహశక్తిని తగిన కాలువలలో ప్రవహింపజేయ బ్రయత్నించుటే ఈ కళాప్రచారకసమితియొక్క ఆశయము.

ఇట్టి ఆశయములుగల కళాప్రచారకసమితియొక్క ఉద్దేశముల ననుసరించి, ఈ పృథ్వీపుత్రి రయింపబడినదా యని దోపజేయుచున్నది. అట్లగుట నీ కృతికర్త నభినందించుచు ఈ గ్రంథమును కళాప్రచారక సమతి ఆంధ్రమహాజనుల కందిచ్చుచున్నది.

సంపాదకుడు.

ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

---

# పీఠిక

సారస్వత ప్రపంచమున విశేష ప్రచారముఁగాంచిన పౌరాణికైతిహాసిక కథావస్తువులందు ఉత్తరరామచరిత్ర మొకటి. అనేక ముఖముల, అనేక రూపముల, అనేక వర్ణముల, నీ ప్రసిద్ధ చరిత్రము చిత్రింపఁబడియున్నది. కేవలము కథాసౌందర్యమునందే కాక పాత్రౌచిత్యమునందును, స్వభావోన్మీలనము నందును సహితము ఆ యా రచయితల దృష్టి నిలచుటచేఁగావలయు, ప్రధాన కథాశరీరమునకు ఘాతఁగల్గింపక, యెవరికిఁదోచినరీతిని వారు శక్తి కొలఁది వస్త్ర భూషణ శృంగారమొనర్చి, ఉత్తరరామ చరిత్రమును సారస్వతరంగమునఁ బ్రదర్శించియున్నారు. అట్టి ప్రదర్శనమునకే పూనుకొనిన యొకానొక కించిన్మాత్రుఁడను నేను. కథాపాత్రలైన మహావ్యక్తుల స్వభావపరిపోషణమే నా ప్రధానాశయము. ఈ సంకల్పమునందు ఎట్టి సాహసమునకైనను నేను వెనుదీయలేదు. నా యంతరంగమును గ్రహించి విద్వత్ప్రపంచము నా సాహసమును మన్నించుఁగాక !

ఈ గ్రంథ రచనమునందు అనేకములగు అన్యభాషా గ్రంథములు నాకుఁ దోడ్పడినవి. ఆ యా గ్రంథములందు నా స్వల్పబుద్ధికి మనోహరములని తోచిన విశేషాంశములనెల్ల న శక్తికొలఁది యీ గ్రంథమునందుఁజిత్రించితిని. ఈ ప్రయత్నమునందునాకు సహాయమొనర్చిన మిత్రవర్గమునకెల్ల నా కృతజ్ఞతా వందనము లర్పించుచున్నాను.

అజ్ఞతాజనితములగు నిందలి లోపములకు ఆంధ్ర మహాజనులను క్షమాభిక్ష మర్థించుచున్నాను.

ఇట్లు

విద్వజ్జన విధేయుఁడు,

గుండిమెడ వెంకట సుబ్బారావు.

గ్రంథకర్త

ఛత్రపురము,

25—9—'45.

# గ్రంథ పరిచయము

కరుణరస ప్రపూర్ణములగు ఐతిహాసిక కథావస్తువులందు ఉత్తరరామచరిత్రము అప్రతిమానమని శ్రీ భవభూతిమహాకవియే స్పష్ట పరచియున్నాడు. సుప్రసిద్ధమైయున్న యీ పవిత్రకథకు ఎన్నెన్నో మెరుగులు వెట్టి, కథావిధానమునందు రసపుష్టికొరకు ఉత్తమములగు మార్పులుచేసి, ఈ 'పృథ్వీపుత్రి' ని రచియించి చి॥ వేంకట సుబ్బారావు ధన్యతంగాంచెను.

విద్వల్లోకమునందు తన చినతనమునాటినుండియు సుపరిచితుడైయున్న యీ గ్రంథకర్తనుగూర్చి పరిచయవాక్యములు వ్రాయబూనుట వెర్రితనము. అమృతరసమొల్కునీతని భాషాసౌష్టవమును, నిరాఘాటమై గంగా. ప్రవాహమునుబోలు నీతని కవితా ప్రవాహమును, ఆంధ్రలోకమునకు చిరపరిచితములే. శబ్దబలమెరింగిన రచయితయగుటచే, నీతఁడుపయోగించిన శబ్దమునుమార్చి వేరొకశబ్దము నా స్థానమునందుంచుట కష్టసాధ్యము.

కథావిధానమునందు ఆమూలాగ్రము అడుగడుగునను రసముచిప్పిలు అద్భుతఘట్టములు, సర్వజనవేద్యమైన యీ ప్రాత కథను నవనవోజ్వలమొనర్చి, ఆ కథయే యిదియా యనిపించుచున్నది.

అదినుండి అంతమువరకును శ్రీరాముని హృదయమునందు, రాజధర్మమునకును హృదయధర్మమునకును జరిగిన దేవదానవ యుద్ధము ప్రశంసార్హము !

ఈ పృథ్వీపుత్రిలో శ్రీరామునిచే వంచితయై సీత యరణ్యాగామిని కాలేదు !

చం॥ పరిణత సర్వకర్మఫలభాగ్య విభాగధురీణ నేను! త్వత్
    చరణ పరాగధారిణిని సాధ్విని, నే సహధర్మచారిణిన్
    భరమగు రాజధర్మ పరిపాలన భారమునన్ సగంబు నా
    శిరమున లేదె; దీనికయి చింతిల నేల నరేంద్ర చంద్రమా!

అని పృథ్వీపుత్రి తనభర్తకు నచ్చజెప్పి, యొప్పించి, స్వేచ్ఛా పూర్వకముగ నరణ్యగామినియైనది !

అశ్వమేధ యాగానుష్ఠానమునకు స్వర్ణసీతను నిర్మించుటకు శిల్పినెవ్వరిని నియమించలేదు. అందుకు సమర్థుఁడగు శిల్పి తాను తప్ప యన్యుఁడు లేడని శ్రీరాముఁడే యీ స్వర్ణవిగ్రహ నిర్మాణము నకు బూనుకొనెను !

శ్రీరామునకును లవకుమారునకును జరిగిన ప్రథమ సమావేశము అద్భుతము !

మహార్ణవమునందలి మణులవలె ఇట్టి యద్భుతరసవత్ ఘట్టములు ఆదినుండి అంతమువరకును గన్పడుచునే యుండును.

సర్వవిధముల నుత్తమోత్తమమై, ప్రదర్శనానుకూలమై, పఠనయోగ్యమై, క్రొత్తదారులద్రొక్కెడు కవులకు మార్గదర్శియై యలరారుచున్న యీ యుత్తమగ్రంథమును, ఆంధ్రభారతికి సమర్పించి, చిరంజీవి వేంకట సుబ్బారావు కృతకృత్యుఁడయ్యెను.

ఆంధ్రజగతి యందు ఈ నూతన నాటకము సర్వజనాదరణామునకు పాత్రము కాగలదని నా దృఢవిశ్వాసము.

బరంపురము,
1—10—45

దేవరాజు వేంకట కృష్ణారావు.

# పాత్రలు

## పురుషులు

శ్రీరాముఁడు

భరతుఁడు

లక్ష్మణుఁడు

శత్రుఘ్నుఁడు

వశిష్ఠుఁడు

వాల్మీకి

అష్టావక్రుఁడు

కుశుఁడు

లవుఁడు

భద్రుఁడు

ప్రధాని, సేవకుఁడు, పౌరులు మొదలగు చిల్లర పాత్రలు.

## స్త్రీలు

సీత

ఊర్మిళ

ఆత్రేయి. (ఆశ్రమవాసిని)

ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీ

# పృథ్వీ పుత్రి



## ప్రథమాంకము

### దృశ్యము.

[అయోధ్య-రాజమందిరము - నిద్రాగతయైన సీత చెంత శ్రీరాముఁ డాసీనుఁడై యుండును.]

శ్రీరా-(స్వగ)ఆహా! యెంతలో నీసుకుమారి గాఢనిద్రాగతయైనది!

గీ. దారుణారణ్య వాస వి। ధ్వస్తమైన
పదియు నాల్గేండ్ల నిద్రను। భవమె కాక
భావి సకల నిద్రా సుఖా। వాప్తి సహిత
మిపుడె సరిపుచ్చు నటుఁ దోఁచు। నీ లతాంగి! 1

ఆహా! కుసుమ కోమలమైన యీ సుకుమార తనూవల్లిక దుస్సహములైన యీ మహారణ్యవాస క్లేశముల నెట్లోర్చెనో కదా!

సీ. గమన మార్గములు క ♦ ర్కశ శిలా కంటక
స్థగితంబులైన కాం ♦ తార తతులు!
విశ్రమ స్థలములు ♦ విష భుజంగ వికీర్ణ
పాషాణ గహ్వర ♦ ప్రాంగణములు!
భోజనంబు లపూర్వ ♦ భుక్త కాలాకాల
సంప్రాప్త ఫలమూల ♦ సంగ్రహములు!
సహచరంబులు పిశా ♦ చ శ్రేణి వెఱపించు
స్వచ్ఛంద వనజంతు ♦ సముదయములు!

గీ. సతి! చతుర్దశ వర్ష వి। స్తరితమైన
ఆ భయంకర కాల మే। ఘాంధ కార
బంధురంబగు ప్రళయ బీ। భత్స రాత్రి
కటకటా! యే విధంబునఁ। గడపి నావొ! 2

( కర్మచారి భద్రుఁడు ప్రవేశించి, సీతనుజూచి మఱలిపోవ యత్నించును. )

శ్రీరా—భద్రా !

భద్రు—మహాప్రభూ, క్షమింపుఁడు, సమయముఁజూచుకొని మరల శ్రీచరణ దర్శనముఁ గావించు కొనెదను.

శ్రీరా—దేవి యిచ్చట నున్నదని సంకోచించు చుంటివా ? అయోధ్యా రాజ్యలక్ష్మియగు నీ పృథ్వీపుత్రి సమక్షమున గోప్యములు కాఁదగు రాజకీయ రహస్యము లేముండును ? భద్రా ! ఏమి విశేషము ?

( ప్రవేశము — ప్రతీహారి )

ప్రతీ—(అభివాదముఁజేసి) మహాప్రభూ ! అష్టావక్రమహర్షి వచ్చి ప్రభుదర్శన మపేక్షించు చున్నారు.

శ్రీరా—మహానందము – భద్రా ! ఇంచుక తాళుము. (లేచి ఋషి కెదు రేగును.)

( ప్రవేశము — అష్టావక్ర మహర్షి )

శ్రీరా—(నమస్కరించి) ఋషిపుంగవా, శ్రీరాముని యభివాదము స్వీకరింపుడు.

అష్టా—విజయీభవ ! విజయీభవ ! రఘు వంశ భూషణా ! ప్రజాను రంజకుఁడవు కమ్ము. ప్రజాహృదయ సింహాసన మలంక రింపుము ! ( ఆసీనుఁ డగును )

శ్రీరా—మునీంద్రా ! ఏ ముహూర్తమున రఘువంశ రాణ్మణులచేఁ జిరాలంకృతమై చిరపవిత్రమై యున్న యీ యయోధ్యా రాజ్య పీఠము నధిరోహించితినో యాక్షణము నుండియుఁ బ్రజాను రంజనమే కదా నా జీవ నాదర్శము !

శా. పాపధ్వాంత విభేద నోజ్జ్వల మణి । ప్రద్యోత సూర్యాన్వయ
శ్రీ పర్యంకము, సత్య విక్రమ యశ । స్తేజోభి రామంబు, సద్
భూపాలోత్తమ భద్రపాద విలసన్ । ముద్రాంకితంబైన యీ
శ్రీ పీఠంబు కళంకితం బగునె యీ । శ్రీరామ రాజ్యంబునన్ ! 8

అష్టా—వత్సా! మహానంద మైనది ! జగదీశ్వరుఁడు నీకుఁ దోడ్పడుఁ గాక !

శ్రీరా—తాపసేంద్రా ! లౌకిక వ్యథా సంకులమైన యీ రాజ మందిరమును దమ పాదరజముచేఁ బవిత్రముఁ జేయఁ గారణ మేమై యుండును ?

అష్టా—తీర్థాటనము ముగించుకొని యాశ్రమాభి ముఖుఁడనై పోవుచు, నా యాత్రాఫలమునకు సంపూర్ణతఁ గలిగించు కొనుటకై యొక్కసారి సీతారాముల జూడ వచ్చితిని.

శ్రీరా—ధన్యోస్మి ! తాపసోత్తమా ! అదే జానకి నిద్రాగతయై యున్నది. తాళుఁడు (లేపఁబోవును)

అష్టా—(వారించుచు) వలదు, వలదు. ఆ తేజస్స్వరూప దర్శనమే నాకుఁ జాలును. ఆ నిష్కలుష దీప్తియే నాకు సర్వపంకిల నివారణము కాఁగలదు.

శ్రీరా—మహాత్మా ! తమ పాద స్పర్శచే నేఁడు మా మందిరము పవిత్రమైనది. ప్రపంచపు దుమారమునందుఁ జిక్కువడి తెన్నుఁ గానకఁ జలించెడు మా బోంట్లకుఁ దమ యట్టి తపోధనుల దర్శనమేకదా తరణోపాయము ! మునీంద్రా ! రాక్షస భయ విదూరమై, తాపసలోక మంతయు నిప్పుడు సేచ్ఛావిలసితమై యున్నది కదా !

అష్టా—రామచంద్రా ! రామ కోదండ రక్షితమై మహీమండల మంతయు నిష్కంటకమైయుండ, తాపస లోకమునకు స్వేచ్ఛ కాక అన్య మెట్లగును ? మహా యశోధనులగు రఘు వరేణ్యుల

నితాంత రక్షణమున ధర్మ పాలనమును, ప్రజాను రంజనమును నిరాఘాటముగఁ బ్రవర్తిల్లుఁగాక యని యావత్ తపోధన లోక మును నిన్నాశీర్వదించుచున్నది.

శ్రీరా——ధన్యోస్మి! ముని వరేణ్యా! ప్రజాను రంజనమునకై నా యైహిక సర్వస్వమును బరిత్యాగము చేయుటకు నేను సర్వదా సంసిద్ధుఁడను. ఈ మణిమయాభరణ సంపత్తియు, ఈ రత్న సింహాసనమును, ఈ మహీమండలాధిపత్యమును, జీవనము నందలి సమస్త లౌకిక పారలౌకిక కామ్యార్థములును, అవ శ్యకమగుచో జీవనాధికయగు నా యర్ధాంగ లక్ష్మిని సహితము, దృణప్రాయముగ విసర్జించుటకు నేను సంసిద్ధుఁడను. మునీంద్రా అధికము నేనేమి వచింపఁగలను!

అష్టా——వత్సా! అఖండ విజయీభవ! నీ జీవన మీ విశాల జగ తికి అప్రతిమానమగు నాదర్శ రత్న దీపమై ప్రకాశించుఁగాక

(ఆశీర్వదించి నిష్క్రమించును)

శ్రీరా——(భద్రునిఁజూచి) భద్రా! ఇప్పుడు చెప్పుము. ఏమి వార్తఁ దెచ్చితివి?

భద్రు——మహాప్రభూ! దేవర శ్రీచరణముల మ్రోలఁ దొలుత నభయదానము నర్థించుచున్నాను.

శ్రీరా——(చిరునగవుతో) ఏమి! అంతటి భీషణవార్తయా యది నిర్భయముగఁ జెప్పుము.

భద్రు——మహాప్రభూ!...... (శంకించును.)

శ్రీరా——భద్రా! శంకించెదవేల? ఈ రాజగృహమున నీవు చిర కాలకర్మచారి వయ్యు రాజహృదయము నింకను గుర్తింపఁ గుంటివా? సత్యవార్త లెట్టి యప్రియము లైనను నీ ప్రభువున

శ్రవణ యోగ్యములే యని నీ వెఱుఁగవా ? నిర్భయముగఁ జెప్పుము.

భద్రు—మహారాజా !......అయోధ్యాపురవాసులు.........
కొందఱు ప్రముఖులు......పరస్పర సంభాషణముల......
శ్రీ జానకీ దేవిని గూర్చి......నిందావాక్యము లాడుచున్నారు.

శ్రీరా— ఏ మను చున్నారు ?

భద్రు—ప్రభూ ! (గద్గదికతో) కళంక భాగిని...

శ్రీరా—(చకితుఁడై) కళంక భాగిని !......ఏమంటివి ? భద్రా, ఏమను చుంటివి ?

భద్రు—మహాప్రభూ ! ......సత్యము పల్కు చుంటిని.

శ్రీరా—పురవాసులు...పురప్రముఖులు...ఏమను చుండిరి ?

భద్రు—రాక్షస గృహ వాసినియైన శ్రీ జానకీ దేవి పరిగ్రహణీయ కాదనియు, అంతఃపుర యోగ్య కాదనియు వదరుచుండిరి, ప్రభూ !

శ్రీరా—(కొంత వఱకు నిస్తబ్ధుఁడై నిట్టూర్పు విడచి) భద్రా ! రాజపీఠ మధిరోహించి నేను నీ మూలమున నిగూఢమగు ప్రజా హృదయమును గుర్తించు చున్నాను. సంతోషము.

భద్రు—( నమస్కరించి, నిష్క్రమించును )

శ్రీరా—(పరిక్రమించుచు స్వగతము) లంకా యుద్ధ సమాప్తమునఁ జరాచర భూతకోటి సాక్షిగ, కుసుమ వర్షమధ్యమునఁ గఠోర పరీక్ష యొనర్చి యగ్ని దేవుఁడు స్వహస్తముల నాకుఁ బ్రత్యర్పణ మొనర్చిన పతివ్రతా శిరోమణి యపవిత్ర యనియే యింకను నా ప్రజల యభిప్రాయమా ? అహా ! ప్రపంచ నియతి ! ... ప్రజాను రంజనమునకై నా సర్వస్వమును బరిత్యజింప నేను ప్రతిజ్ఞాధారణ మొనర్చితిని ... ప్రజాను రంజనము ! ...

ప్రజానురంజనము ! ... ప్రజాను రంజనమున సత్యమున
స్థానము లేదా! ... కేవలము ప్రజానురంజనమునకై సాక్షాద్ధ
ర్మమగు సత్యమును నిరాకరింప వలయునా ?

సీ. బహు యుగ ప్రఖ్యాత । మహిత సూర్యాన్వయ
ప్రాభవోన్నతిఁ జూపు । భాగ్య రేఖ !
కలుష భంజన విశద । గాంగ నిర్ఝర తుల్య
నవ నవోజ్జ్వల జీవ । న స్రవంతి !
అఖిల భూతాత్మకం । బైన విశ్వంబెల్ల
హృదయమం దిడుకొన్న । ప్రేమ జలధి !
సకల యాతా యాత । సాధ్వీ సతీ సృష్టి
కాదర్శ రత్న దీ । పాంకు రంబు !
గీ. త్రిభువనారాధ్య చరిత ! పృ । థ్వీకుమారి
అహహా ! మత్ ప్రజాసంఘ మీ । హస్తాగ్రములను
భగ్న శీలయై పతితయై । పాడు వడెనె !
సత్య మడుగంటెనే ధరా । చక్ర మందు !!

సీత—(నిద్రలోఁ బలువరించుచు) పతివ్రతను ! ...పతివ్రతన
రాకు సాధమా ! ... నన్నంటితివేని ... నీ మూర్ధము
సహస్ర ఖండములు కాఁగలదు ! ...

శ్రీరా—(సీత చెంతకుఁబోయి, స్వగతము) నిద్రలోఁబలువరిం
చున్నది ! మాయా సన్న్యాసి యైన రావణ హ[illegible]
యత్యాచార ఘట్టము కావలయు నీమె యంతర్నేత్రమున[illegible]
బొడఁగట్టు చున్నది ! ... అహో ! ప్రజా నాయకులారా
ఈమెయేనా మీ దృక్పథమునఁ గళంక భాగిని !

(ప్రవేశము — వశిష్ఠుఁడు)

వశి—వత్సా ! రామచంద్రా !

—వశిష్ఠ మునీంద్రా ! ప్రణామము (నమస్కరించును.)

వశి—మహోయశః ప్రాప్తిరస్తు! ...ఇదేమి! నిరంతర చిదానంద మోహనమగు నీ ముఖ బింబమున సంతాప రేఖ దృశ్యమగుచున్నదేమి ? నేత్రములు బాష్పావరుద్ధములై యున్నవేమి ? రామచంద్రా! ఏమి సంభవించినది ?

శ్రీరా—గురుదేవా !

గీ. మలిన మయ్యె సూర్యాన్వయ । మహిత కీర్తి !
పతిత మయ్యెను రఘు వంశ । భాగ్య లక్ష్మి !
దగ్ధ మయ్యెను శ్రీరామ । ధర్మ దీక్ష !
అంధ కారావృతం బయ్యె । నయోధ్యా పురంబు ! 8

వశి—వత్సా ! ఏమి జరిగినది ?

శ్రీరా—జనక రాజ తనయ కళంకిని, అపరిగ్రహణీయ, అని అయోధ్యా పురవాసుల యభిప్రాయము.

వశి—ఏమీ ! జనక రాజ తనయ కళంకిని యని పురవాసుల యభిప్రాయమా ? ఈ యసత్యవార్త నీ కర్ణముల నెట్లు సోకినది ? పతివ్రతా శిరోరత్నము ! సర్వ సద్గుణ స్వరూపిణి ! అయోధ్యా సౌభాగ్యలక్ష్మి ! పృథ్వీపుత్రి కళంక భాగినియా ? ఈ తుచ్ఛ ప్రలాపమును నీ వెట్లు విశ్వసించితివి ?

శ్రీరా—గురు దేవా ! నా యాంతరంగిక భృత్యుఁడు భద్రుఁడీ వార్తను దెచ్చినాఁడు.

వశి—( యోచించి ) ఎన్నఁడును మిథ్యావాది కాని విశ్వసనీయ భృత్యుఁడే, భద్రుఁడు !

శ్రీరా—రాజ్యము నందలి ప్రజాప్రముఖులు కొందఱు పరస్పరము సంభాషించుకొనుచుండిరఁట ! రాక్షసాపహృతయై, రాక్షస గృహవాసినియైన కాంతను దమ ప్రభువు పరిగ్రహించి యంతఃపురమునం దుంచుట దోషమని వారి యభిప్రాయము.

వశి—ఇది యావత్ ప్రజాభిప్రాయమై యుండునా ?

శ్రీరా—గురు దేవా ! శ్రీరామ రాజ్యమున నిందావాక్యము ఏక మాత్రమైనను యావత్ ప్రజాభిప్రాయ తుల్యముగనే భావింపఁ బడు నని తా మెఱుఁగరా ?

వశి—నిశ్చయము...నిశ్చయము...కర్తవ్యము నిరూపింపఁ జాల కున్నాను.

శ్రీరా—మునీంద్రా! కర్తవ్యమున కేమున్నది ! ప్రజానురంజనమే నా కవశ్యకర్తవ్యము ! ప్రజాను రంజనమునకై యాత్మ బలి దానముఁ జేయుదును.

వశి—ఎట్లు ?

శ్రీరా—ప్రజాసంతుష్టికై నాజీవన తేజమగు జానకిని విసర్జించెదను. అయోధ్యనుండి బహిష్కరించెదను.

వశి—హరి హరీ ! ఎట్టి కఠోర వాక్యము నా కర్ణములఁ బడినది!

శ్రీరా—గత్యంతరము లేదు గురు చంద్రమా ! ఆశీర్వ దింపుఁడు, రాజధర్మ నిర్వహణము నందు నాహృదయము దుర్బలము కాకుండు నట్లు నన్నాశీర్వదింపుఁడు.

వశి—కుమారా! యశశ్వివి కమ్ము. వంశవర్ధనుఁడవు కమ్ము! ఈశ్వర సంకల్ప మనివార్యము. ఈ భయంకర పరీక్షా సమయమున సర్వేశ్వరుఁడు నీకుఁ దోడ్పడుఁగాక ! (నిష్క్రమించును)

శ్రీరా—( మెల్లగ సీతవైపు నడచుచు ) ఈశ్వర నియతి యమోఘము ! అప్రతి హతము ! ... ఆహా ! ... ఆనాటి వాలి సంహార దృశ్యము...నా కన్నులకుఁ గట్టుచున్నది ! ... ఆ మహావీరాగ్ర గణ్యుని వక్షః కవాటమును...భేదించితిని ! ఆ రక్త ధారా ప్రవాహము ... నేఁడు, నా కన్నుల యెదుటఁ బాఱుచున్నది ! ... క్షత గాత్రుఁడై ... ఆ వీరశిఖామణి

నేలఁగూలి ... గిజ గిజ గింజుకొనుచు ...భూమ్యాకాశములు ద్రవీభూతము లగునట్లు ... పల్కిన యీ దీనాలాపములు... ఇప్పుడు నా కర్ణములఁ బ్రతిధ్వనించు చున్నవి! ... మహా పతివ్రత...తార! ... భర్తృకళేబరముపై వ్రాలి ... ఎంత ఘోషించినది ! ... ఆ మహాసతి ... అమోఘ శాపాక్షరములు ... ఇప్పుడు ... నా కర్ణపుటములం మాఱు మ్రోగు చున్నవి ! ... ఆహా ! ఆహా ! రావణ ధర్మపత్ని ! పతివ్రతా శిరోమణి ... మండోదరి ! ... ధూళిధూసరిత ! భర్తృ కంఠోద్గత రక్తధారా స్నాత ! ఎట్టి భయంకర శాపము ! ... ఆ మహాఘోషణము ... ఇప్పుడు నాకు శ్రవణ గోచర మగు చున్నది ! ... ఓహో ! లంకా సంగ్రామ రంగము ! ఏమి యీ యమాయక రాక్షస వధూ హాహాకారములు ! శాపోపహతుఁడను ! శాపోపహతుఁడను! మహాపతివ్రతాశాపఫల మనుభవించెదను ! ... హా ! సీతా ! సీతా !

( తెర వ్రాలును )

---

దృశ్యము 2.

( రాజమందిరము — శ్రీరాముఁడు, లక్ష్మణుఁడు )

శ్రీరా— లక్ష్మణా ! అతికఠోరమైన రామకార్యమొక్కటి నీ వివ్పుడు నిర్వర్తింప వలసి యున్నది ! నా యాజ్ఞాపాలనముఁ గావించెదనని ప్రతిజ్ఞఁ జేయుము.

లక్ష్మ— ప్రభూ ! ఇదేమి నేఁ డిట్లనుచుంటిరి ?

గీ. 'రామ' యను సుధా మధురాక్ష | రములు రెండు
తొలుత నేనాఁడు నా జిహ్వ | పలుక నేర్చె,
నాటి మొదలు లక్ష్మణ శిరో | న్యస్తమై, య
నాదృతంబైన రామ వా | క్యంబు కలదె ?

చం. నరవర ! దుర్గమోగ్ర విపి | నంబుల వాయుజలోప జీవినై
మఱచి ప్రపంచ మెల్ల, క్షణ | మాత్ర విరామ మెఱుంగకన్ భవత్
చరణ సరోజ నిత్య పరి | చర్యల నుంటిఁ జతుర్దశాబ్దముల్,
అరసితె యెన్నఁడైన నెదు | రాడుట శ్రీరఘురామవాక్యమున్! 7

శ్రీరా— నిశ్చయమే. అయినను నీ ప్రతిజ్ఞా వచనమును నేను కోరుచున్నాను. లక్ష్మణా ! నా ప్రస్తుతాదేశ మెంతటి భీషణమో నీ వెఱుఁగవు.

లక్ష్మ— అది యెట్టి భీషణాదేశమైనను శ్రీరామాజ్ఞకుఁ బ్రతివచనము నానోట నెన్నఁడైన వెల్వడునా? కానిండు. మీ యభిమతానుసారముగ నే నిదే ప్రతిజ్ఞఁ జేయుచున్నాను. సెలవిండు.

శ్రీరా— సౌమిత్రీ ! ఇప్పుడు నీవు స్వహస్తముల నా హృదయమును ఛేదింపవలసి యున్నది.

లక్ష్మ— ( విస్మితుఁడై ) ప్రభూ ! మీ యభిప్రాయ మేమి ?

శ్రీరా— నా హృదయమునకు హృదయము, ప్రాణమునకుఁ బ్రాణము, నా యిహపరసర్వస్వము నైన సీతను దోడ్కొని పోయి దూరారణ్యమధ్యమున విసర్జించి రావలయును.

లక్ష్మ— ( చకితుఁడై ) ఏ మను చుంటిరి ప్రభూ ? నిర్మేఘమైన యాకసమునుండి యీ యకాలవజ్రపాత మేమి ? ఈ యాజ్ఞయా, నేను పాలింప వలెను ?

శ్రీరా— లక్ష్మణా ! సూర్యవంశ ప్రతిష్ఠ అయోధ్యారాజమార్గములపై ధూళిలోఁ గలియ నున్నది ! అన్యోపాయము లేదు. జానకీదేవి అయోధ్యనుండి బహిష్కరింపఁబడక తీఱదు.

లక్ష్మ— నే నేమియు గ్రహింపఁ జాలకున్నాను. ప్రత్యక్ష రాజ్యలక్ష్మియగు శ్రీజానకీదేవి యేల అయోధ్యనుండి బహిష్కరింపఁబడవలెను ?

రా — రాక్షసాపహృతయై శత్రునిర్బంధ వాసినియైన సీత నిష్కలు
షత్వమును అయోధ్యాపురవాసులు, శంకించుచున్నారు.
ఆమె యపవిత్ర, అపరిగ్రహణీయ - యని పల్కుచున్నారు.
ప్రజానురంజనమునకు బద్ధకంకణుఁడనైయున్న నేను రాజ
ధర్మ నిర్వహణార్థము ప్రజాసంతృప్తికై జానకిని బహిష్కరించు
చున్నాను.

లక్ష్మ — ( ఉత్తేజితుఁడై ) ఏమీ ! మూర్ఖ ప్రజాకోటి మిథ్యా
ప్రవాద కారణమున ఆ పరమసాధ్విని మీరు బహిష్కరింపఁ
బూనితిరా ? విచ్ఛిన్న దర్పమై, అవనత మస్తకమైన యశేష
రాజమండలము సమక్షమున శివధనుర్భంగ మొనర్చి, యే
మహాసతిని సహధర్మచారిణిగఁ బాణిగ్రహణ మొనర్చితిరో,
యే మహాపతివ్రతాలలామ సాహచర్య సంపత్తిచేఁ బదు
నాల్గేండ్ల మహారణ్యవాసము స్వర్గవాసముకన్న మహత్తర
మైనదో, యే జీవన రత్నమును గోల్పడి సమగ్ర దండకారణ్య
మును సీతానామసంక్షుభిత మొనర్చి నయనాశ్రుధారా
విఘూర్ణిత మొనర్చి యుంటిరో, యే సాధ్వీ పరిత్రాణమునకై
సేతుబంధన లంకాసంగ్రామ ప్రముఖ మహాకార్యము లొనర్చి
యుంటిరో, అనంత భూతకోటి సాక్షిగ నగ్నిపరీక్షా సముత్తీర్ణయై
యే మహాదేవి కుసుమ వర్షాభిషిక్తయై తమ శ్రీచరణస్పర్శ
మొనర్చినదో, అట్టి జగత్పావనిజగజ్జనని, జనకరాజపుత్రి
యపవిత్రయా ? బహిష్కరణ యోగ్యయా ? ప్రభూ ! ఈ
భయంకరాదేశమును పాలించుటకు నేను కేవల మశక్తుఁడను!
...అశక్తుఁడను...మహాప్రభూ... ఈ యాజ్ఞను ఉపసంహరింపుఁడు.

శ్రీరా — అట్లు జరుగనేరదు లక్ష్మణా ! ఇది యత్యంత కఠోర
నియతి యని నాకుఁ దెలియును. విధి విధానము అనుల్లంఘ
నీయము ! ప్రయాణ సన్నాహముఁ గావింపుము...

( నిష్క్రమించును. )

లక్ష్మ— ( స్వగ ) హా ! జగదీశ్వరా !

గీ. అపుడు మేఘ నాథుని దుర్జ | యాస్త్ర నిహతి
కాల మృత్యు కరాళ దం | ష్ట్రలఁ జిక్కి
ప్రాణములు గోల్పడక యుంక | బ్రతికి యుంటి
ఆహహా ! యీ ఘోర పాప ని | ర్వహణమునకె !

( ప్రవేశము — ఊర్మిళ )

ఊర్మి— ప్రాణేశ్వరా ! ఇదేమి ! పూర్ణచంద్ర సంకాశమగు తమ వదనమండలమున విషాద మేఘచ్ఛాయ కన్పట్టు చున్నది ! కారణ మేమి, ప్రభూ ?

లక్ష్మ— ఊర్మిళా !

గీ. పిడుగు పడె నిర్మలా కాశ | వీథి నుండి
రాజ మందిర గోపు రా | గ్రంబు మీద !
తగిలి సచరాచరముగ నం | తఃపురంబు
కూల నున్నది పాతాళ | కుహర మునకు !

ఊర్మి— ఏమి ? ఏమి సంభవించినది ?

లక్ష్మ— సీతా బహిష్కరణము ! అరణ్య మధ్యమున ఆమెను నేను విసర్జించి రావలయును. ఇది శ్రీరామాజ్ఞ !

ఊర్మి— ( చకితయై ) ఏమీ ! ఏమీ ! సీతా బహిష్కరణమా? స్వయముగ రఘుపతియే యీ యాజ్ఞ నొసంగిరా ? కారణ మేమి ?

లక్ష్మ— సతీమణీ ! శ్రీరామాజ్ఞా పాలనము నందు నాకుఁ గారణ జిజ్ఞాస కేవల మనావశ్యకము. ఊర్మిళా ! హృదయ విదారణ మగు ఈ భీషణవార్తను జానకీదేవికి నీవు తొలుత నివేదింపుము.

ఊర్మి— ప్రభూ ! అతి దుర్బలహృదయ నగు నాకది సాధ్యమగునా?

లక్ష్మ— సతీ ! అంతకు వేయిరెట్లధిక మగు నిష్ఠుర కార్యమును నేను చేయనున్నాను.

చం. కటికి కసాయినై యిపుడు । కాఱడవిన్ విడువంగనుంటి · దు
ర్మరణము పాలొనర్చి రఘు । రాణ్మహిషిన్ పరిపూర్ణ గర్భిణిన్
తరుణి ! మదస్థిపంజరము । దగ్ధమొనర్చుచు నున్న యీ హృదం
తర విలయాగ్ని హోత్ర దహ । న క్రమణోద్ధతి నీవెఱుంగుదే !

దేవీ ! నా మనఃక్లేశమున నీ వించుక భాగహారిణివి కావా? ఈక్షణమే పోయి యీ వార్తను దేవికి నివేదింపుము. నేను ప్రయాణ సన్నాహముఁ గావించెదను.

(నిష్క్రమించును.)

ఊర్మి— (స్వగ) హా ! జనకరాజతనయా ! అయోధ్యా రాజ్యలక్ష్మి ! ఏముఖముతో నేను నీకీ భయంకర వార్తను నివేదింపఁగలను ? జగదీశ్వరా ! నా హృదయమును పాషాణముఁ జేసి వేయుము.

(ప్రవేశము — సీత)

సీత— ఊర్మిళా ! ఆర్యపుత్రు లెందున్నారు ? నిద్రాగతనై యుండిన నన్నువిడిచి వా రెచ్చటి కేగిరి ? (ఊర్మిళ ముఖము వైపు జూచుచు విస్మితయై) ఇదేమి ? ఏడ్చుచుంటి వేల ? సౌమిత్రి యేమైనఁ దిరస్కారముఁ జేసియుండెనా ?

గీ. వనము లందునఁ బదునాల్గు । వత్సరములు
వన్యమృగ సంఘముల సహ । వాస మంది
మానవత్వంబు మొదలంట । మఱచె నొక్కొ
లక్ష్మణుం డుత్తమోత్తమ । లక్షణుండు !

ఊర్మిళా ! నీ సమక్షమందే యాతనికి బుద్ధిఁగఱపెద నుండుము.

(కన్నీరు తుడుచును)

ఊర్మి— దేవీ !... (దుఃఖము నాపుకొన యత్నించును. )

సీత— ఊర్మిళా ! ఇంత స్వాభిమానము భర్తల పట్ల మనకుఁ దగునా ?

ఊర్మి— దేవీ ! నన్ను క్షమింపుము. నా యపరాధ మెట్టిదైనను నీవు నన్ను క్షమింతునని వాగ్దానముఁ జేయుము.

( కన్నీరు తుడుచుకొనును. )

సీత— ఊర్మిళా ! నీ కేమి సంభవించినది ? ఊరకుండుముః నీ వపరాధముఁ జేయుటయు, నేను క్షమించుటయునా ?...

ఊర్మి— దేవీ ! నేను నిర్భాగ్యను ! నన్ను క్షమింపుము.

(దుఃఖాతిశయమునఁ గన్నీరు కార్చుచుండును.)

సీత— నీ చిత్తవృత్తి యేకారణముననో చలించు చున్నది ! ఇంచుక విశ్రమింపుము.

ఊర్మి— దేవీ ! నన్ను క్షమింపుము. నా భర్త యాదేశమున నేను నీ కొక భయంకర వార్త నివేదించెదను...

సీత— ఏమది ?

ఊర్మి— అయోధ్యాపతి...నీకు...వనవాస దండనము విధింప నున్నారు...అయోధ్యా రాజ్యమునుండి...బహిష్కరణము !

( మహాదుఃఖమునఁ గన్నీరు తుడుచుకొనును.)

సీత— ( నవ్వి ) ఏమనుచుంటివి ? నాకు వనవాస దండనమా ! అయోధ్యాపతి విధించెద రా ? అదే హేతువుగ నీ వేడ్చు చుంటివా ? (నవ్వి) అయ్యో, అమాయక బాలికా ! ఆ మాత్రము నీవు గ్రహింపఁజాలక పోయితివా ? లక్ష్మణుఁడు నీతోఁ బరిహాసము లాడుట కిదియే ప్రారంభమా ? (నవ్వును.)

ఊర్మి— ఏమీ ! అంటిరేనా ? ఊరకఁ బరిహాసమునకే నా పతి యట్లంటిరా ? ... దేవీ ! ఇది కేవలము పరిహాసమేనా ?... నిశ్చయముగ పరిహాసమే యగునా ?

సీత— ఊర్మిళా ! సీతాబహిష్కారము ! అరణ్యవాస దండనము ! సీతాపతి యాజ్ఞ !! నీవే యోచించుకొనుము.

సీ. తెగి రాలి పడ లేదు ♦ దివినుండి మార్తాండ
చంద్రగోళము లింక ♦ సరసిజాక్షి !
ఆక్రమింపఁగ లేద ♦ నంత బ్రహ్మాండంబుఁ
బ్రళయ మేఘము లింక ♦ పద్మవదన !
సంచలింపఁగ లేదు ♦ చక్రవాళమును జం
ఝామారుతము లింక ♦ సదమలాంగి !
కురి యంగ లేదు వి ♦ క్షుభి తాంతరిక్షంబు
వజ్రవర్షం బింకఁ ♦ బ్రవిమ లాత్మ !
గీ. మాటుపడ లేదు విలయ స ♦ మ్మార్జనమున
ప్రస్ఫుటంబగు శ్రీరామ ♦ రామ రామ
మధుర శబ్ద మింకను వాయు ♦ మండలమున !
బేల ! భయ మేల, పరిహాస ♦ లీలలకును ?

ఊర్మి— దేవీ ! ఇంకను నాదక్షిణనేత్ర మేల యదరుచున్నది నా పతి పరిహాసమునకైనను నాతో నెప్పుడు నసత్యముఁ బల్కరే !

సీత— మంచిది. నే నిప్పుడే రఘురాముల దర్శించి యీ సందేహ నివృత్తి గావించెద నుండుము.

( నిష్క్రమించును. )

ఊర్మి—( స్వగ ) ఆహా ! ఎట్టి యచంచల విశ్వాసము ! ఎట్టి యాత్మార్పణము !. ఓ జగత్ప్రభూ ! నాప్రాణపతి , వాక్యము కేవలము పరిహాస మాత్రమే యగుఁగాక !

( నిష్క్రమించును. )

## దృశ్యము 3.

( ఉద్యానము — శ్రీరాముఁడు వేదికపై విశ్రమించియుండును.
ప్రవేశము — కౌసల్య. )

కౌసల్య—కుమారా ! అంతఃపురము అశాంతి సంకులమైయున్నది. నేను వినియుండిన వృత్తాంతము సత్యమే యగునా? లక్ష్మణ కుమారు నడిగితిని. దుఃఖాశ్రు విరసమైన ముఖమును వాల్చుకొని యాతఁడు నిరుత్తరుఁడై నా సమక్షమునుండి నెడలి పోయెను. భరతుఁడు కోపారుణిత లోచనుఁడై యేమేమో గొణుగుకొనుచుఁ బ్రత్యుత్తర మీయకయే రాజగృహమును విడిచి పోయెను.

శ్రీరా—అమ్మా ! నీవు వినిన దంతయు సత్యమే. రాజధర్మమును పాలించు నిమిత్తము సీత నయోధ్యనుండి నేను బహిష్కరింప నున్నాను.

కౌస—సత్యమే ? ... ... నాయనా ! పురుషోత్తముఁడైన శ్రీరాముని గాంచిన భాగ్యరాశిని నే నని నిరంతరము గర్వించుచుంటిని ! నేటివఱకును ఆ యానందగర్వమే నా యీ శుష్కశరీరమున కాధారమై యుండినది. తండ్రీ ! ఇంతకాలమునకు నాకు గర్వభంగమైనది. నిష్కళంకమైన రామునామము ఇప్పుడు కళంకీభూతమైనది. ఇంక నా జీవనమువలనఁ బ్రయోజనము లేదు.

శ్రీరా—అమ్మా ! ... అమ్మా ! ...

కౌస—కుమారా ! సర్వశాస్త్రవేత్తవు ! విజ్ఞాన చక్రవర్తివి ! న్యాయ నిష్ఠాగరిష్ఠుడవు ! ఇదియా నీ న్యాయనిష్ఠ ? ఇదియా నీ విజ్ఞాన పరిణామము ! మహాపతివ్రత ! నారీలోకైక మకుటమణి ! అట్టి ధర్మపత్నిని బహిష్కరించుటయే నీ ధర్మరక్షణమైన, ఇంకఁ బ్రపంచమున ధర్మమెక్కడ ? క్షేమ మెక్కడ ?

శ్రీరా — అమ్మా! అమ్మా! నాపై నాగ్రహించుచుంటివా? నా సర్వస్వము నశించినను నీ ప్రేమబల మొక్కటిమాత్రము మిగిలియుండిన, నేనీ యావత్ ప్రపంచ దుఃఖభారమును అవలీల భరించఁగలను. నా యంతరంగమును బరిశీలింపక కేవలము నా బాహ్యప్రవృత్తినే గమనించెదవా? స్వహస్తములతో నా చితిని నేను నిర్మించుకొని చిచ్చురగిల్చి ఆ యగ్నిజ్వాలలందు నా సర్వలౌకిక తాపోపశమనమునకై నే నాత్మోత్సర్గముఁ గావించుకొన నిశ్చయించియున్నాను. తల్లీ! సీతాబహిష్కరణము! ధర్మపత్నీ విసర్జనము! శ్రీరాముని హస్తముల జరుగవలయును! ఇది ఈశ్వరసంకల్పము! యావద్వృత్తాంతము నెఱింగితివేని నీవు సహితము నా నిశ్చయమును బ్రతిఘటింపవు.

కౌస — ఏమి సంభవించినది? అంతయును నాకుఁ జెప్పుము. అన్యోపాయ మేమైన నూహింపఁ గలనేమో చూచెదను.

శ్రీరా — అమ్మా! అన్యోపాయము లేదు. ప్రతిజ్ఞాబద్ధుఁడను! సూర్యవంశోద్భవుఁడను నేను! ప్రతిజ్ఞాపాలనము తప్ప నా కన్యమార్గము లేదు. నా సర్వాంగములు నిప్పుడు ప్రతిజ్ఞా శృంఖలాబద్ధములు! ఇంక నాకు గత్యంతరము లేదు.

కౌస — ఆ ప్రతిజ్ఞ యేమి?

శ్రీరా — ప్రజానురంజనమునకై యాత్మోత్సర్గము! ప్రజాసంఘము సీతా బహిష్కరణము నపేక్షించుచున్నది! అమ్మా! సూర్యవంశ వధూమణివి! దశరథేశ్వరుని యర్ధాంగలక్ష్మివి! నీకుఁ దెలియునుకదా మన వంశ ప్రతిష్ఠ?

కౌస — ప్రజాసంఘ మేల సీతా బహిష్కరణ మపేక్షించుచున్నది? లోకోత్తరచరిత్ర! మహాపతివ్రత! మఱియు పూర్ణగర్భధారిణి! అట్టి జగదేకపూజ్యకు బహిష్కరణమా? దాని కిదియా సమయము?

శ్రీరా— అమ్మా ! విధి వేపరీతమై యాకాశము నుండి వజ్రపాతము సంభవింపనుండ, సమపూపమంతయు విచక్షణమున కవకాశము కలదా ?

కౌస— నిశ్చయముగ నిది వజ్రపాతమే నాయనా ! సర్వత్ర అమంగళ చిహ్నములే పొడఁగట్టుచున్నవి ! —అదే ! కల్యాణి జానకి యిటు వచ్చుచున్నది. ఆ యమాయికబాలిక నిష్కలుష వదనాబ్జము నేను చూడఁజాలను.

( నిష్క్రమించును. )

( ప్రవేశము — సీత )

సీత— (మందహాసముతో) ఆర్యపుత్రా ! తాము నన్నయోధ్య నుండి బహిష్కరింపఁ బోవుచుంటిరా ? అరణ్యములందు విసర్జింప నుంటిరా ? ఊర్మిళతో సౌమిత్రి చెప్పెనఁట ! (నవ్వుచు) అమాయకురాలు ! లక్ష్మణుని పరిహాసములను నమ్మి కొనినది ! కన్నీరు గార్చుచు నామె నాచెంతకు వచ్చి యెంత విలపించినది ! (శ్రీరాముని ముఖమువైపు నిదానించి) అదేమి ! ప్రాణేశ్వరా ! వదనమండలము నిస్తేజమై యున్నదేమి ? నేత్రము లశ్రుపూర్ణములై యున్నవేమి ? ప్రభూ ! ఏమి సంభవించినది ?

శ్రీరా— (ముఖము వాల్చుకొని నిరుత్తరుఁడై కన్నీరు గార్చుచుండును.)

సీత— తెలిసినది ! ... తెలిసినది ! ... ఊర్మిళ యశ్రుపాతము నిర్హేతుకము కాదు...ప్రాణేశ్వరా ! ఏమి జరిగినది ? నా యెడ గోపనముఁ జేయఁ దగు విషయము తమ కేమి కలదు?

శ్రీరా— (మహా దుఃఖముతో) సీతా ! ... సతీమణి ! ...

సీత—వచింపుఁడు, ప్రాణపతీ ! వచింపుఁడు 'సీతా ! నీముఖమును

నేను చూడ నొల్లను; నీ వయోధ్యను విడచి తిరిగి యరణ్యము
లకుఁ బొమ్ము' అని నోరారఁ బల్కుఁడు. ఆ యాజ్ఞావాక్యమును
శిరమునఁ దాల్చి మహానందముగఁ బోయెదను.

శ్రీరా— దేవీ! క్షమాయోగ్యము కాని మహాపరాధమును
చేయ నున్నాను. అయినను క్షమా భిక్ష మర్థించు చున్నాను.
నీల కంఠ కంఠస్థమగు హాలాహలము నతిక్రమించు మహావిష
మును నేను పాన మొనర్చితిని. ఆ భయంకర హాలాహల
జ్వాలా జాలముచే నా సర్వాంగములును దగ్ధములగు చున్నవి.

సీత— (భయముతో) ప్రభూ! ఏమి సంభవించినది?

శ్రీరా—భయంకరమైన పరీక్షా సమయ మాసన్న మైనది!

సీత— ప్రభూ! ఆ పరీక్షా విధాన మెట్టిది?

శ్రీరా— "ప్రజాను రంజనమునకై నా ఐహిక సర్వస్వమును
బరిత్యజించెద"నని ప్రతిజ్ఞాధారణ మొనర్చితిని.

సీత— ప్రాణేశ్వరా! అంతియేనా? దాని కింత చింతిల్లనేల?
సూర్యాన్వయ సంభూతుల కిది యొక నూతన ప్రతిజ్ఞయా?

తే॥ గీ॥ క్షత్రియ ప్రాణులకుఁ జావు | సక్రమంబు,
వజ్ర శకలంబులకుఁ గళా | వైభవంబు,
రవికులోద్భూతులకుఁ బ్రజా | రంజనంబు,
సహజగుణసంపదలు కదా | సార్వభౌమ! 18

శ్రీరా— దేవీ! ఆ ప్రజానురంజనమున కిప్పుడు నా బహిఃప్రాణము,
నా జీవన జ్యోతి, జానకి, బలి దానము కావలసి యున్నది!

సీత—అట్టి పవిత్ర బలిదానమునకు నేను సర్వసిద్ధముగ నుండు
దాననే కదా! కాని, ప్రజానురంజనమునకు నే నెట్లు అంత
రాయముఁ గల్గించితిని?

శ్రీరా— దేవీ! రాక్షసహస్తంగతవై శత్రు నిర్బంధ వాసినివై

యుండిన హేతువుచే జానకీదేవి కళంకిత బహిష్కరణీయ, అని ప్రజ లుద్దేశించు చున్నారు !

సీత— (కొంచెము యోచించి) ప్రభూ ! లంకా యుద్ధ సమాప్తిని నా పవిత్రతా నిరూపణార్థము జరిగి యుండిన అగ్నిపరీక్షా విధానమును ప్రజలు స్వీకరించుట లేదా ?

శ్రీరా— వారి ప్రవాద వైఖరి యట్లే తోచుచున్నది.

సీత— పోనిండు. ప్రభూ ! తాము స్వీకరించితిరా ? తమ యంతరంగము నా విషయమున నిశ్శంకమై యున్నదా ?

శ్రీరా— సతీమణీ ! ఇదిగో నా యనాచ్ఛాదిత వక్షము. దీనిని భేదించి చూడుము. శ్రీరామహృదయము నీకు గోచరింపఁ గలదు. సర్వాంతర్యామి, అనంత భూత బహిరంతర్వేది, పరాత్పరుఁడు, నా నిష్కళంక హృదయమునకు ఏకైక సాక్షి.

సీత— ప్రాణపతీ ! ఇంక నాకు విచారము లేదు. నిరాఘాటమగు కాలచక్ర భ్రమణము నరికట్టుట యెవ్వరికి సాధ్యము ? విధి విధానము జరిగి తీరవలయును. ప్రభూ ! ఆజ్ఞాపింపుఁడు. మహానందముగ నేను తమ యాజ్ఞాపాలనముఁ గావింతును. ఇంతకును, ప్రాణేశ్వరా ! నేను తమ యర్ధాంగిని కానా ?

చం॥ పరిణత సర్వ కర్మఫల । భాగ్య విభాగ ధురీణ నేను ! త్వత్
చరణ పరాగ ధారిణిని ! । సాధ్విని, నే సహధర్మచారిణిన్ !
భరమగు రాజధర్మ పరి । పాలనభారమునన్ సగంబు నా
శిరమున లేదె ! దీని కయి । చింతిల నేల నరేంద్రచంద్రమా ? 14.

ప్రభూ ! ఆజ్ఞాపింపుఁడు.

శ్రీరా— (మహాదుఃఖముతో) సీతా ! ... సీతా ! ... జగదేక సాధ్వీ ! నేను మహాపాతకుఁడను ! ... అభాగ్యుఁడను ! ...

(కన్నీరు గార్చును.)

సీత — ప్రాణప్రియా ! దుఃఖించెద రేల ? పితృవాక్య పరిపాల
నార్థము నాఁడు తా మరణ్యమునకుఁ బోయియుంటిరి. భర్తృ
ధర్మ పరిపాలనార్థము నేఁడు నే నరణ్యమునకుఁ బోయెదను.
ఇందు విశేషమేమున్నది ?

(శ్రీరాముని కన్నీరు తుడుచును.)

(ప్రవేశము — లక్ష్మణుఁడు)

సీత — సౌమిత్రీ ! ఈక్షణమే రథమును సిద్ధముఁ జేయుము. నేను
స్వేచ్ఛాపూర్వకముగ నరణ్యగామిని నగుచున్నాను. నీవే
స్వయముగ నన్నరణ్యమున డించి రావలయును.

(లక్ష్మణుఁడు తలవంచుకొని కన్నీటితో నిష్క్రమించును.)

సీత — ప్రభూ ! తమ పాద ధూళిచే నా మూర్ధమును బవిత్రముఁ
జేయుఁడు. (శ్రీరాముని పాదములపై శిరముంచి మ్రొక్కి)
ప్రాణపతీ ! ఇంక నా యవశిష్ట జీవనము...శ్రీరామ నామో
చ్చారణము ! శ్రీరామ పదధ్యానము ! ఈ పూర్ణ గర్భము
సూర్యాన్వయ శాశ్వత ప్రతిష్ఠకు అంకురార్పణ మొనర్చుఁ
గాక ! ప్రభూ ! ఆశీర్వదింపుఁడు-ఆశీర్వదింపుఁడు.

(నమస్కరించును.)

శ్రీరా — (మహాదుఃఖమున) ఓ జగద్బాంధవా ! నా హృదయము
నకు నీవు సాక్షి ! నిరపరాధిని యైన యర్ధాంగలక్ష్మిని విధి
ప్రేరితముగ నరణ్యముల విసర్జించుచున్నాను. నా మహాప
రాధమునకు ... యోగ్యదండనము ... జగత్ప్రభూ ! జగ
ద్రక్షకా !...నీవే యోచింపుము. నేటితో నాజీవన తేజ మస్త
మించును ! ...రామనామము...విద్రోహమయము...పాప
సంకులము...అమంగళము ! ... సీతా ! సీతా !

(సీతను కౌఁగలించుకొనును.)

సీత — మహాప్రభూ ! దుఃఖింపకుఁడు! సర్వమంగళ విధాత, సర్వ
హృదయ సాక్షి, జగదీశ్వరుఁడే మనకుఁ దోడు ! ఈశ్వరేచ్ఛ

నిరంతరాయముగ నెఱవేరుఁగాక ! ఇంక నాకు సెలవొసంగుఁడు రాజమాతృగణమును దర్శించి పోయెదను.

(శ్రీరాముని పాదములకు సాష్టాంగప్రణామముఁ జేసి నిష్క్రమించును.)

శ్రీరా— (మహాదుఃఖమున) ! సీతా! సీతా ! ...

(మూర్ఛిల్లును.)

## దృశ్యము 4.

[ తమసానదీతీరము— వాల్మీకి ఆశ్రమము— వాల్మీకి తపోదీక్షయం దుండును. శిష్యగణము నిశ్శబ్దముగ నాశ్రమ కార్యముల నిర్వర్తించుచుందురు. ]

వాల్మీ— (శ్రీరామకీర్తనముఁ జేయును. అనంతరము ధ్యాన సమాధియం దించుక యుండి, పిమ్మట నూర్ధ్వాభిముఖుఁడై తదేక దృష్టిని జూచుచు)

ఆహా ! విధి విధానము ! ... అదే ! ... అయోధ్యా రాజ్య లక్ష్మి ! ... శ్రీరామ ధర్మపత్ని ! ... అయోని సంభవ! పృథ్వీపుత్రి-జానకి ! ... పూర్ణ గర్భ ధారిణి ! భర్తృ పరిత్యక్తయై తమసానదీ పరిసరారణ్యమున ఏకాకినియై సంచరించు చున్నది ! ఆహా ! ఏమి యీ మహాసతి మనస్థైర్యము ! ఏమి యీ జగదేక పూజ్య ఆత్మవిశ్వాసము ! భగవన్ ! అనంత జన్మాగతమైన నాకర్మానుభవము నేటితో నంతముకానున్నది. నా తపోదీక్ష నేఁడు ఫలింప నున్నది. పోయి యీ మహాదేవి నిచ్చటకుఁ దోడ్కొని వచ్చెదఁగాక. (లేచి) బాలకులారా, నేను వచ్చుసరికి ఆశ్రమప్రదేశ మంతయు నలంకరించి యుంచుఁడు. నేఁడు మన యాశ్రమము నకు మహాలక్ష్మి విజయము చేయును. ఆమె శుభాగమనమునకు సర్వమును సిద్ధముఁ జేయుఁడు.

సీ. పుష్పసుగంధ స । మ్మోహ నంబయి యాత్మ
మోహాంతవన మెల్ల । నొప్ప వలయు !
అభిరామముగఁ దోర । ణాలంకరణ కోటి
కుసుమవర్షంబులఁ । గురియ వలయు !
శుక శారికా పిక । ప్రకరముల్ మంగళా
హ్వాన గీతంబులన్ । బాడ వలయు !
వన మయూరములు నే । ర్చిన సర్వ సంపూర్ణ
నాట్య కౌశలముఁ గ । న్పఱుప వలయు !
ఆ. వె॥ ప్రతి లతాగృహంబు । ప్రతి శిలాశకలంబు
రామ ! రామ ! రామ ! । రామ! యనుచు
ప్రస్ఫుటారవములఁ । బ్రత్యేక నిమిషంబుఁ
బలుక వలయు నిచట । బాలలార ! 15.

ఏదీ, నేను మీకు నేర్పిన సంధ్యాగీతమును బాడుఁడు.

బాలురు—(ఏక కంఠ్యముగ శ్రీరామ కీర్తనముఁ జేయుదురు.)

వాల్మీకి—మహానందమైనది. ఇంక నేను పోయి వచ్చెదను.

(శ్రీరామ కీర్తనముఁ జేయుచు నిష్క్రమించును.)

దృశ్యము 5.

[ తమసానదీ ప్రాంతారణ్యము—ఏకాకినియై సీత ప్రవేశించును ]

సీత—(స్వగ) అంధకారమయమై, అగమ్యగోచరమై యున్న నా భావిజీవన మట్లు ఈ మహారణ్య మెంత భయంకరమై యున్నది! ఏకాకినినై యున్న నా దెస కొక్క వన మృగంబైనను రాకున్న దేమి ? అయోధ్యా రాజ్యమునందుఁబలె నీ యరణ్యరాజ్యము నందు సహితము నే నస్పృశ్యనే యైతినా ? అపరిగ్రహ యోగ్యనే యైతినా ! బహిష్కరణమే యిచ్చట సహితము నా విధి విధానమా ? హా ! పరమేశ్వరా ! నేనేమి యపరాధముఁ జేసితిని ? ... అదే, తేజోరాశి, జగజ్జీవనుఁడు, లోకబాంధవుఁ

అస్తంగతుఁడగు చున్నాఁడు ! ఇంక నతిస్వల్పకాలమునందే ఈ సంధ్యారాగము అంధకార గర్భమునందు లీనము కానున్నది ! ఈ యంధకార జగతి యందు నే నింక నెచ్చటికిఁ బోయెదను ? ... గమనాయాస మధిక మగుచున్నది ! ఇంక నొక్క యడుగైనను నడువఁజాలను. ఈ పాషాణవేదికపై నించుక విశ్రమించెద. (శిలపైఁగూర్చుండి) ఓ గర్భస్థ రఘువంశ మణీ ! పాపాత్మురాలను, నిన్ను నే నెంత యలయించుచుంటిని! అయ్యో ! ఏ భాగ్యశాలిని గర్భము నందైనఁ బడక, ఈ యభాగిని గర్భవాసమునం దేలఁ జొచ్చితివి ?

సీ॥ ఏ ముండ్లతుప్పయో | యే తిప్పయో కదా
  రఘు వంశ మణి ! నీకుఁ | బ్రసవ శయ్య !
ఏ వ్యాఘ్రి కాంతయో | యే భుజంగియొ కదా
  నరపాల సుత ! నీకుఁ | బురుడు పోత !
ఏ పాడు పంకమో | యే కల్మషమొ కదా
  బాలార్క ! నీకుఁ బ్రి | క్షాళనంబు !
ఏ లతాప్రతతియో | యే గడ్డియో కదా
  చంద్రాస్య ! నీకు నా | చ్ఛాదనంబు !
గీ॥ సర్వ సర్వంసహా చక్ర | చక్రవర్తి
రఘుకులేశ్వరు వంశ వ | ర్ధనుఁడ వీవు,
దిక్కుమాలిన పక్షివై | చిక్కు వడితె
అకట ! ఈ భాగ్యహీన గ | ర్భాంతరమున ! 16

కాలనియతి యనుల్లంఘనీయము ! కానిమ్ము. అన్నిఁటికిని సర్వాపన్నివారణమగు శ్రీరామ చరణమే నాకు శరణ్యము ! సత్యవ్రత రక్షణార్థమై శ్రీరామాజ్ఞా నిబద్ధనై నరకమునకు సహితముఁ బోవనున్న నాకీయరణ్యవాస మొక లెక్కయా ? ... కాని ... కాని ... ఆనాటి వనవాసమునకును, ఈనాటి వనవాసమునకును ఎంత తారతమ్యము కలదు !

సీ॥ పతిచరణాబ్జసేవ నిర । వద్య సుఖంబున స్వర్గరాజ్య సం
స్థితిఁ బదునాలు గేండ్లు గడ । చెన్ బదునాలుగు వాసరంబులై;
ప్రతిహత సర్వ భాగ్యనయి । భర్త్ర బహిష్కృతనై పరాభవ
క్షత నయి, యిప్పుడీ నరక । గర్భ నివాసముఁజేయ వచ్చితిన్ !

( తెరలో వాల్మీకి రామకీర్తనము )

సీత—(ఆలించి)ఏమది! ఈఘోరారణ్యమధ్యమునందు రామనామా
మృత వర్షమును గురియుచున్న యాయదృశ్యమేఘమెయ్యది?

( ప్రవేశము — కీర్తనముఁ జేయుచు వాల్మీకి )

సీత— (లేచి, వాల్మీకి చెంతకేగి) ఓ మహాపురుషా! ఈ యభాగిని
ప్రణామ మందుకొనుఁడు.

వాల్మీ— సౌభాగ్యవతీ ! కులదీపకులగు కుమారులఁ గాంచుము
(ఆశీర్వదించును.)

సీత— మహాత్మా ! ఈ యరణ్యమును శ్రీరామనామ విఘూర్ణిత
మొనర్చుచున్న తమవృత్తాంతముఁదెల్పి నన్ను ధన్యను జేయుఁడు.

వాల్మీ— కుమారీ ! నేను ఈ తమసానదీ ప్రాంతము నం దాశ్రమ
వాసినై తపోదీక్షనున్న వాల్మీకి యను వాఁడను ! శ్రీ రామా
యణ కావ్య కర్తను ! ఓ రామపత్నీ ! జనకరాజపుత్రీ ! నీ
వృత్తాంత మంతయు దివ్యదృష్టిని గుర్తించి యున్నాను. అమ్మా!
రమ్ము. నా యాశ్రమమునకు రమ్ము. నీ పవిత్ర పాదధూళిచే
నా తపోవనమును బావనముఁ జేయుము. నా జీవనము ధన్యముఁ
జేయుము.

సీత— ధన్యాస్మి ! ధన్యాస్మి ! మహాపురుషా ! ఈ యభాగిని
కృతజ్ఞతాభివందన మందుకొనుఁడు. (నమస్కరించును.)

వాల్మీ— దేవీ! రమ్ము. నా యాశ్రమమిచ్చటికిఁజాల సమీపము
నందేయున్నది. నా తపఃప్రభావముచే, ఇదిగో, నీ సర్వాంగ
ము నుజ్జీవితమొనర్చుచున్నాను. తల్లీ ! నా వెనువెంట రమ్ము.

(శ్రీరామకీర్తన మొనర్చుచు సీతను దోడ్కొని నిష్క్రమించును.)

శ్రీ
రామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీ

# పృథ్వీ పుత్రి

## ద్వితీయాంకము

### దృశ్యము 1.

[ ఉద్యానము — శ్రీరాముఁడొక పాషాణవేదికపైఁ గూర్చుండి యుండును. ]

శ్రీరా — ఆహా ! అంతఃపురము నిస్తేజమై పర్వత గుహాప్రాయమై యున్నది ! ఆ రామవనము నిర్జీవమై శ్మశానప్రాయమై యున్నది ! ఇంక నాకెచ్చట శాంతి లభించును ? ... ఈ శుష్క కళేబరమునకు శాంతి యెచ్చటిది ? అభిశాపహతుఁడ నగు నాకు ఇది యెంతయుఁ దగియే యున్నది ! క్షుద్ర మహీ రాజ్య ధర్మమునకై నిరుపమానమగు హృదయ సామ్రాజ్య ధర్మమును దగ్ధమొనర్చిన యాత్మవంచకుఁడను ! దుర్బలుఁడను నేను ! నా యపరాధమునకుఁ దగిన శిక్ష నే ననుభవింపకఁ దీఱునా ? ఆ శిక్షా విధానము ప్రారంభమైనది ! దీని కింక నంతము లేదు.

( ప్రవేశము — ప్రధాని )

ప్రధాని — మహారాజా !

శ్రీరా — ఏమి కావలెను ?

ప్రధాని — ప్రభూ ! దక్షిణ దేశమునుండి ఘోరవార్తలు వచ్చు చున్నవి ! దుర్భిక్షా పీడితులై ప్రజలు విశేషముగ మరణించు చున్నారఁట !

శ్రీరా— పాపము శాంతించుఁగాక ! అమాత్యశేఖరా ! ఈ క్షణమే సమర్థులగు నుద్యోగులఁ బంపి దక్షిణ దేశము నందంతటను అన్నసత్రములను స్థాపింపఁ జేయుఁడు. మన భాండారము నందలి ఖాద్య పదార్థ సంగ్రహ మంతయు నచ్చటకుఁ బంపుఁడు. ఈ ప్రయత్నమున ధనకోశమంతయు శూన్యమైనను నాకు విచారము లేదు.

ప్రధాని— మహాప్రసాదము. (నిష్క్రమించును.)

శ్రీరా— (మందహాసముఁ జేయుచు) శ్రీరామరాజ్యమునందు... దుర్భిక్షు ! అంతయును యథా యోగ్యముగనే యున్నది ! ఇం దాశ్చర్యమేమి కలదు !

తే॥ గీ॥ సర్వ సంపూర్ణ సౌభాగ్య । సౌఖ్య లక్ష్మి
ఈ మహా రాజ్యమున నాట । నే తొలంగె,
పరిభవ క్లాంత యైన యా । పరమ సాధ్వి
కాననంబుల కేనాఁడు । కదలి చనెనో !

( ప్రవేశము — ప్రతీహారి )

ప్రతీ— (అభివాదముఁ జేసి) మహాప్రభూ ! ఎవ్వఁడో బ్రాహ్మణుఁ డొకఁడు వచ్చి ప్రభు దర్శన మపేక్షించు చున్నాఁడు.

శ్రీరా— తక్షణమే యాతని నిచ్చటకుఁ బంపుము.

ప్రతీ—మహాప్రసాదము. (నిష్క్రమించును.)

( ప్రవేశము — బ్రాహ్మణుఁడు )

శ్రీరా —విప్రోత్తమా ! శ్రీరాముని యభివాద మందు కొనుఁడు. (నమస్కరించును)

బ్రా—మహారాజా ! సప్త వర్షప్రాయుఁడగు నా పుత్త్రుఁడు మరణించినాఁడు. నీ రాజ్యమునం దీ యకాలమరణము సంభవించినది ! సూర్యాన్వయుల రాజత్వమున ముం దెన్నఁడు నిట్టి

యకాల మరణములు లేకుండెను. రామచంద్రా! నీ రాజ్యము నందు సంభవించినది! దీని కుత్తరవాదివి నీవు కావా?

(కోపము నభినయించును)

శ్రీ రా — భూసురోత్తమా! శాంతింపుము ...

బ్రా — రాజ్యమునందకాలమృత్యుభయము నివారింప శక్తి లేకున్న సింహాసన మేల నధిరోహించితివి? ఇదియా నీ ప్రజాను రంజనము? ఇదియా నీ ధర్మపరిపాలనము? కేవలము పత్నీత్యాగ మాత్రమునఁ బ్రజాను రంజనము సంపూర్ణమగు నను కొంటివా? రాజా! నీవు మహాపాతకివి! కావుననే యీ రాజ్యమునందీ యకాల మరణములు! ... హా! పరమాత్మా! దీనబంధూ! ఈ నికృష్ట పాపరాజ్యమునందు నన్నేల నివసింపఁజేసితివి తండ్రీ! — (ఏడ్చును.)

శ్రీ రా — బ్రాహ్మణోత్తమా! నేనపరాధినే యైననీవు నన్ను క్షమింపుము. తొలుత నా యాతిథ్యమును స్వీకరింపుము. పిమ్మట సంప్రాప్తమైన యీ యకాల మరణమును గూర్చి చర్చింతము.

బ్రా — వలదు-వలదు. నీ యట్టి పాపిష్ఠప్రభుని యాతిథ్యము నాకు వలదు-నీ పాపమే నిన్ను దహించుఁ గాక.

(నిష్క్రమించును.)

శ్రీ రా — విప్రోత్తమా! సత్యము పల్కితివి. నిశ్చయముగ నేనొక పాపిష్ఠ ప్రభువునే. నిరపరాధిని యగు ధర్మపత్నిని బహిష్కరించితిని. అరణ్యములందు విసర్జించితిని. ఉన్మత్తునివలె నాత్మీయ సర్వసౌఖ్య సంపత్తిని మట్టిలోఁ గలిపివైచితిని! ప్రజాను రంజన మను ఆకాశకుసుమమునకై యాత్మోత్సర్గముఁ జేయుచుంటిని!

(ప్రవేశము — వశిష్ఠుఁడు)

వశి — రఘురామా!

శ్రీరా—గురుదేవా! నా పాపవశమున రాజ్యమునం దమంగళము
వాటిల్లినది ! ఒకానొక బ్రాహ్మణ బాలకుఁడు అకాల మర
ణము నొందెను. దీనికిఁ బ్రాయశ్చిత్త మనుగ్రహింపుఁడు.
రాజ్యము నందు అమంగళము శాంతించు నిమిత్తము నేను
ప్రాణత్యాగమున కేని సిద్ధముగ నున్నాను.

వశి — వత్సా ! వృథా మనస్తాపముచే నీవేలఁ దపించుచున్నావు ?
నీవు చేసిన పాపమేమి ? నీవు కేవలము నీ కర్తవ్యమును నిర్వ
హించితివి. సత్యవ్రతుఁడవును, ధర్మమూర్తివియు నైన నీకెన్నఁ డైన
పాపస్పర్శ యుండునా ? గోదావరీ తీరవాసులైన కొందఱు
తపోధనుల వలన నేను యథార్థమును గ్రహించితిని. రాజ్యము
నందలి యీ యకాలమరణ దుర్భిక్షా ద్యమంగళములకుఁ గార
ణము నాకుఁ దెలిసినది. శంబుకుఁడను నొక శూద్రుఁడు
స్వధర్మత్యాగ మొనర్చి విప్రధర్మ మగు యజ్ఞదీక్షను గ్రహిం
చినాఁడు. వర్ణాశ్రమ ధర్మద్రోహియై, సమాజశృంఖలముల
భేదించి ఆ శూద్రయోగి యిప్పుడు దండకారణ్యమున యజ్ఞము
జేయుచున్నాఁడు. అదియే దాక్షిణాత్యమునందా యనావృష్టికిని
దుర్భిక్షమునకును, ఈ యకాల మరణములకును గారణమై
యున్నది !

శ్రీరా—గురుదేవా ! అట్లైనఁ బ్రస్తుతము నా కర్తవ్యమేమి ?

వశి— కర్తవ్యమున కేమున్నది ? ధర్మద్రోహియగు నా శంబుకుని
రాక్షసప్రాయునిగఁ దలంచి యాతని సంహరించుటయే
దేశమునకు సర్వారిష్ట నివారక మగును.

శ్రీరా— గురుదేవా ! శంబుకుఁ డెట్లు ద్రోహియయ్యెనో నే
నూహింపఁజాల కున్నాను. స్వేచ్ఛాపూర్వకముగ జపయజ్ఞ
ములఁ జేసికొనుచున్నంత మాత్రమున నాతని దోష మేమి

తే॥ గీ॥ విశ్వనాథుని సామ్రాజ్య ♦ పీఠమునకు
బ్రాహ్మణోత్తమ! భేదభా ♦ వంబు కలదె?
ఇట్టి వర్ణాశ్రమాచార ♦ శృంఖలములు
కలవె తన్మహారాజ్య చ ♦ క్రంబునందు?

మహాత్మా! ఆ శంబుకుని యజ్ఞదీక్షయే సర్వారిష్టములకును హేతు వనుట నా కంత యుక్తియుక్తముగఁ దోచుటలేదు. నా పాపకర్మమే యీ సమస్తమునకును మూలకారణము. ఆ పాపమునకు యోగ్యదండనము నే ననుభవించెదను.

వశి—— వత్సా! విశ్వనాథుని సామ్రాజ్యపీఠమునకును నీ సామ్రాజ్యపీఠమునకును సామ్యములేదు. సర్వశాస్త్రవేత్తవు! ఈ విషయము నీకుఁ దెలియకపోదు. వర్ణాశ్రమధర్మము లనియెడు బలీయ స్తంభములమీదనే మన సామ్రాజ్యపీఠము నిశ్చలమై నిలచియున్నది. ధర్మద్రోహ మేనాఁడు ప్రారంభమగునో ఆ నాఁడే సంఘవిప్లవమును, సామ్రాజ్యపతనమును బ్రారంభమగును. శంబుకుఁడు ధర్మద్రోహియని నీవు గుర్తించితివేని, అవశ్య మాతని దండించుటయే రాజధర్మము!

శ్రీరా—— (యోచించి) రాజధర్మమా!... తుచ్ఛరాజత్వము!... రాజత్వమున ధర్మము!... మంచిది, గురూత్తమా! రాజధర్మమునకు నేనాత్మవిక్రయ మొనర్చుకొని బహుకాలమైనది. శంబుకుఁడు నిశ్చయముగ రాజదృష్టియం దపరాధమే యొనర్చుచుండిన నేను రాజధర్మమునే పాలించెదను. నేఁడే దండకాటవి కేగి శంబుకునిఁ జూచెదను.

వశి—— ఉత్తమము. రఘురామా! రాజ్యము సర్వారిష్ట విదూరమై సర్వసౌఖ్యనిలయమై వెలయుఁగాక! (నిష్క్రమించును)

శ్రీరా——ఆహా!

తే॥ గీ॥ కడచె సీతాపరిత్యాగ ♦ కాండమపుడు,
కడచు నింక శంబుక వధా ♦ కాండమిపుడు!
అహహ! ఈ మహారాజత్వ ♦ మందునిట్టి
పుణ్య కాండంబు లిక నెన్ని ♦ ముగియవలెనో! (నిష్క్రమించును)

దృశ్యము 3.

---

[దండకారణ్యము - శంబుకుని యజ్ఞవాటిక — శంబుకుఁడు యజ్ఞవేదికపై నాసీనుఁడై యుండును. చెంత భార్య తుంగభద్ర నిలచియుండును.

నేపథ్యమున వేద ఘోషము. ]

శంబు—(చేతులు జోడించి) హే చరాచర భూత బహిరంతర్విహారీ ! హే వేదవేద్యా! హే జ్యోతి స్వరూపా ! హే పరమ పురుషా ! హే అనంత సృష్టిస్థితిలయ విధాయకా ! హే జగద్రక్షకా ! పాహిమాం ! పాహిమాం ! (ధ్యానంగతుఁడగును.)

( ప్రవేశము—శ్రీరామ లక్ష్మణులు )

శంబు—(కన్నులు విప్పి శ్రీరామునిఁజూచి మహానందముతో లేచి) సముజ్జ్వలిత సర్వదిగంతమూర్తివై, నీలమేఘశ్యాముఁడవై యున్న నీ వెవ్వరవు మహాపురుషా, ఈ యరణ్యదేశమునఁ బ్రత్యక్షమైతివి ! నా యజ్ఞఫల స్వరూపుఁడవై యున్న నీ వెవ్వరవు ప్రభూ ! ఈ మనోజ్ఞ స్వరూపమే నా నితాంతధ్యానమూర్తి ! ఈ స్వరూపమే... ఈ స్వరూపమే, ఈ మనోహర తేజోమూర్తియే నా తపోదృష్టికి సర్వదా ప్రత్యక్షమగుచున్నది ! ఆహా ! నేను ధన్యుఁడను ! ధన్యుఁడను !

సీ॥ పవనాంబు భక్షులై ♦ భయదాటవుల ఘోర
తప మొనర్చెడు తపో ♦ ధనులకైన,
సంసార దూరులై ♦ సర్వసంగ త్యాగు
లై సంచరించు సం ♦ యములకైన,
జపహోమ యజ్ఞ దీ ♦ క్షా గరిష్ఠాత్ములౌ
బ్రహ్మ ప్రధాను వ ♦ ర్ణులకైన,
ఆహార నిద్రా వి ♦ హారసంతత హరి
ధ్యానులౌ భక్త స ♦ త్తములకైన

అందగాడని సచ్చిదా • నందమూర్తి !
సర్వభూతాంతరస్థ తే • జస్స్వరూపి !
సకల బ్రహ్మాండ సామ్రాజ్య • చక్రవర్తి !
ఆహాహా ! యెంతలో నాకుఁ బ్ర • త్యక్షమయ్యె !!

శంబు— రాఘవా ! మనము తరించితిమి ! రమ్ము ... రమ్ము.

(శ్రీరాముని పాదముల చెంత సాష్టాంగ మొనర్చును)

శ్రీరా— శంబుకా ! నన్ను గుర్తించితివా ?

శంబు— దేవా ! గుర్తించితిని. నీవు నా ధ్యానమూర్తివి ! నా తపస్సమాధియందు ఈదూర్వాంకుర శ్యామలమూర్తియే సదా నాకుఁ గన్పట్టుచుండును ! నా యంతర్దృష్టికి ఈ తేజోరాశియే సర్వదా గోచరించుచుండును. దేవాదిదేవా ! ధన్యోస్మి ! ధన్యోస్మి !

శ్రీరా— ఓయీ, నే నెవ్వరి ధ్యానమూర్తినిఁ గాను. తపస్సమాధియందు ఎవ్వరి హృదయములను నేను వసించువాఁడనుకాను. నేను కేవల మొక మనుష్యమాత్రుఁడను !

శంబు— కాదు. కాదు. ఈ నీల నీరద మనోజ్ఞమూర్తినే నేను నిత్యమును నా తపస్సమాధినిఁ జూచుచున్నాను! ... ఇంచుక తాళుము. (కన్నులు మూసికొని ధ్యానమునందుండి, తిరిగి కన్నులువిప్పి) ఈ స్వరూపమే ! ఈ మనోహర శాంతమూర్తియే ! నా యెదుట నిప్పుడు ప్రత్యక్షమైయున్న యీ దివ్యమంగళ విగ్రహమే యది ! అణుమాత్రమును భేదము లేదు. ఈ యాకర్ణాంత విశాల నేత్రములే యవి ! ఈ యాజానుబాహువులే యవి ! ఈ నీలరత్నచ్ఛటా మోహన మూర్తియే యది ! మహాపురుషా ! నన్నేలఁ బరీక్షించెదవు ? నా ధ్యానమూర్తివే నీవు. సందియము లేదు.

శ్రీరా — శంబుకా ! నేను నీ ధ్యానమూర్తిని గాను. అయోధ్యా రాజ్యమున కధీశ్వరుఁడను నేను. ఎన్నఁడైన రామ నామమును వినియుంటివా ?

శంబు — రామనామము ! వినియుంటిని, ప్రభూ ! వినియుంటిని. అనేక ముఖములఁ వినియుంటిని ! తొల్లి మహావనమునందు నేను దివా రాత్రములు శ్రీరామ నామమునే జపించు చుంటిని ! పితృవాక్య పరిపాలనార్థమై రాజ్యభోగ పరిత్యాగమొనర్చి, సతీ సమేతముగ నే దినమున నీవు మహారణ్యా గామివైతివో, యా దినమే శ్రీరామనామము నా జపమాలపైఁ బ్రతిధ్వనించుట కారంభము ! కాని, రఘుపతీ ! ఏ దినమున లోకాపవాదమునకు భీతిల్లి మహాపతివ్రత, లోకైక పావని, నిరపరాధిని, పూర్ణగర్భధారిణియగు జానకీ దేవిని విభ్రాంతమతివై, యరణ్యాగర్భమున విసర్జించితివని వినియుంటినో, ఆనాటినుండియు రామనామము నందలి మాధుర్యము నాకనుభూతమగుట లేదు. రామనామము ధూమకేతువు వలె నా హృదయమున కుత్పాతసూచకమై తోఁచినది ! దివ్యమూర్తియని నేను భావించిన శ్రీరాముఁడు కేవల మొక క్షుద్ర మనుష్యమాత్రుఁడని నేను గుర్తించితిని. ఆ దివ్యత్వము అణుమాత్రమైనను నీయందు నా కిప్పుడు గోచరించుట లేదు — అయినను...అయినను...నా ధ్యానదృష్టికిఁ బ్రత్యక్షమగుచుండిన యా మనోహరమూర్తివే నీవు ! సందేహము లేదు. ఇందలి రహస్యమును నేను గ్రహింపఁజాలకున్నాను !

శ్రీరా — గ్రహింపవలసిన యావశ్యకతయు లేదు. శంబుకా ! ప్రస్తుతము నేను నీ యెదుట న్యాయాధిపతినై నిలచియున్నాను. నీ యపరాధమునకు నేను నీకు మరణదండనము విధింప వచ్చియున్నాను.

శంబు — మరణ దండనమా? రామచంద్రా! నా యపరాధమేమి?

శ్రీరా — వర్ణాశ్రమ ధర్మద్రోహివై, నీవు సమాజ నియమముల నతిక్రమించితివి. నీ యజ్ఞకర్మ హేతువుచే రాజ్యమునం దనావృష్టియు, దుర్భిక్షమును, అకాల మరణములును సంప్రాప్తము లగుచున్నవి.

శంబు — (నవ్వి) రాజ్యమునందలి యుపద్రవములకు నా యజ్ఞకర్మమా హేతువు! ఇంతయుక్తిహీనమగు వాక్యమా నీ ముఖమునుండి యెట్లు వెల్వడినది ప్రభూ! ఇదియా నీ న్యాయనిష్ఠ?

తే॥ గీ॥ కులసతీ విసర్జన మహా ♦ కలుషమనను
నీదు దుస్తిమిత్వ మిపుడు భ్రాం ♦ తిగత మయ్యె!
పాప పుణ్యవిచార సం ♦ దీపనమ్ము
సాధ్యమగు టెట్లు నీకింక ♦ సార్వభౌమ? 22

శ్రీరా — శంబుకా! కాలయాపనమువలన, ప్రయోజనము లేదు. నీ యపరాధమునకు శిక్ష ననుభవించుటకు నీవు బాధ్యుఁడవు.

శంబు — రఘుపతీ! ప్రాణత్యాగమునకు నేను వెనుఁదీయుట లేదు. కాని, నీ ధర్మవిచారమునకు నాకు నవ్వువచ్చుచున్నది! రామచంద్రా! నీ యధఃపతనమునకు నేను దుఃఖించుచున్నాను. నీ పూర్వప్రతిభ చిహ్నమాత్రమైనను మిగులక సంపూర్ణముగ నశించిపోయినదా? మహారాజా! తెలిసినది! ... ...

తే॥ గీ॥ ఏ రమాదేవి తేజః ప్ర ♦ సారణమున
నీవు తేజస్వివైయుంటి ♦ వన్ని నాళ్లు,
ఆ మహాతేజ మిపు డర ♦ ణ్యముల కేగ!
కాకయున్న నీకీ యధో ♦ గతి యదేల? 23

మ॥ అకలంకంబగు వంశమా నవసె, ను ♦ న్మత్త జీవనాశాలతా
ప్రకరంబెల్ల పదాహతంబయి చనెన్ ♦ బాతాళ గర్భంబునన్!
ఇఁక రాజోత్తమ! పాడు రాచటికమం ♦ దేమున్నదం చీవు మా
నక మోహ మెత్తితి, వా జగజ్జనని వెం ♦ టన్ గానకున్ బోవకన్?

శ్రీరా — శంబుకా! నీతోఁ దర్కవితర్కములుచేయుటకు నేను రాలేదు. నేను యుక్తిజ్ఞాన తేజోవిహీనుఁడనైన నగుదును గాక! శాస్త్రనియమానుసారము నీ యపరాధమునకు శిక్ష ప్రాణహరణము! ఆ శిక్షావిధానముఁ బాలించుటకు నేను వచ్చితిని. ఎట్టి మరణమును నీవపేక్షింతువో చెప్పుము; సైన్య సమేతముగ నీవు నన్నెదుర్కొనఁ గోరెదవా?

శం — రాజేంద్రా! నీతో యుద్ధమా? రావణ విజేతయగు జగదేక వీరునితో యుద్ధమా? ఇంతకును యుద్ధమున సంహరించుట యొక శిక్షయగునా? నాకుఁ బ్రాణదండనము విధించితివి. ఇదిగో, ఆత్మార్పణ మొనర్ప సిద్ధముగ నున్నాను. నా మూర్ధమును ఖండింపుము. (శిరము వంచును)

తుంగభద్ర — (ముందునకు వచ్చి) సూర్యాన్వయ సంభవుండును, పుణ్యవ్రతుండును అగు శ్రీరాముఁడను ధరణీపతివి నీ వేనా మహాపురుషా! నీ యెడ నే యపరాధము నెఱుఁగని నాభర్తను సంహరింపఁ బూనితివా?

శ్రీరా — కల్యాణీ! నీ భర్త సంఘవిప్లవకర్తయై, దేశారిష్టములకు హేతుభూతుఁడయ్యెను. ఆ యపరాధ మెట్టిదో నీకుఁ దెలియదు.

తుంగ — మహారాజా! నా భర్త నిశ్చయముగ నపరాధియే యైనను, కులకాంతను: అశ్రుధారాసిక్తనై యర్థించుచున్నాను. క్షమాభిక్ష నొసంగవా? నిరపరాధినినైన నన్ను అనాథను జేసి వేయుదువా?

శ్రీరా — కాంతామణీ! నీ భర్త యపరాధము రాజదృష్టియందు క్షమాయోగ్యము కాదు. శాస్త్రనియతి యనుల్లంఘనీయము.

తుంగ — మహాపురుషా! రాజదృష్టి మానుషదృష్టి కతీతమైనదా?

శ్రీరా — ఆ జిజ్ఞాసకు ప్రస్తుతము నాహృదయమునందు స్థానము లేదు

కేవల రాజత్వమునకై నేను మానుషత్వమును విక్రయించుకొని పాపకారి నైనది !

శంబు— తుంగభద్రా ! నే నొనర్చినది యపరాధము కాదు. నీ పతిని [illegible] నేల ? కేవలము స్వజాతి సంస్కరణమే నా యాదర్శము కాని, పరధర్మ గ్రహణము కాదు. మానవ సంఘమునందుఁ బరికల్పితమై యున్న స్వార్థ నియతిని నేను ప్రతిఘటించితినే కాని, సర్వోత్తమమగు ఈశ్వరనియతిని నేను ప్రతిఘటింపలేదు. రఘురామా ! నీ శిక్షావిధానమును నీవు పాలింపుము. సిద్ధముగ నున్నాను.

శ్రీరా— లక్ష్మణా ! నా ధనుర్బాణముల నిటు తెమ్ము.

( లక్ష్మణుఁడు అందిచ్చును. )

తుంగ—(ఆవేగమున ఇరువురి మధ్యను నిలచి) నిష్ఠురాత్మా ! ముందు నా ప్రాణముల హరింపుము. అస్త్రమును బ్రయోగింపుము. ముందు స్త్రీవధా ప్రశస్తిఁ బడసి, పిదప నిరపరాధ ప్రాణముల హరింపుము. నిర్దోషియగు మహాసాధ్వి యావిర్భూమి హృదయముపై వజ్రాఘాత మొనర్చితివి ! లంకారాజ్యమును శ్మశాన మొనర్చి యా రుద్రభూమిని శతలక్ష రాక్షసవధూ హాహాకారములచేఁ బ్రతిధ్వనింపఁ జేసితివి ! ఈ విధానము నీకు గ్రొత్త కాదు. కానిమ్ము, అస్త్రమును విడువుము; నీకీర్తి చరిత్రమును మూడులోకములును గీర్తింపఁ గలవు !

శ్రీరా—(బింకముగ) సాధ్వీమణీ ! ప్రభుకార్యమున కంతరాయముఁ గల్గింపకుము. తొలఁగుము.

శం— తుంగభద్రా ! దూరముండుము. నిర్విచారముగ నుండుము. మన జీవనలీల కిదియే సమాప్త మనుకొంటివా ? అది యనంతము – అప్రతిహతము !

తుంగ — (ప్రక్కకుఁ దొలఁగ తీవ్రముగ) వధింపుము: వధింపుము)
రాజేంద్రా! భర్తప్రాణముల హరించి నిరపరాధిని యగు ధర్మపత్నిని అనాథను జేయుచుంటివా, పాషాణ హృదయా?
(ఏడ్చును.

శ్రీరా — సతీమణీ! నీవు సత్యముఁబల్కితివి నాహృదయమిప్పుడు పాషాణమే యైయున్నది. నా తనూమనఃప్రాణ సర్వస్వము నిప్పుడు పాషాణమయమే యైనది. లౌకిక వ్యథాసముచ్చయములు ఎంతటి కఠోరములైనను నన్నిప్పుడు బాధింపఁజాలవు. కేవల రాజధర్మమునకై పూర్ణగర్భిణియైన యర్థాంగలక్ష్మిని విసర్జించితిని. కేవల రాజధర్మమునకై యిప్పుడు నీ భర్తప్రాణముల హరించెదను.

శం — ఇది రాజధర్మము కాదు, రాజేంద్రా. ఇది రాజధర్మపు నిర్జీవ కంకాళము. దానిని నీవు పూజించు చుంటివి. రాజధర్మమును, సత్య ప్రతిష్ఠయు, చాల కాలమై నిన్నుఁబరిత్యజించినవి.

భోగత్యాగి | నై తొల్లి యేనాఁడు
కాషాయ వస్త్రంబుఁ | గట్టి నావో!
అధముఁడౌ గుహుని ప్రే | మాంజలి నేనాఁడు
శ్రీపాద యుగళ మ | ర్పించి నావో!
శబరి యుచ్ఛిష్ట ఫ | లాదంబు నేనాఁడు
సిద్ధామృతముగ భ | క్షించి నావో!
పగఁబాసి రావణ | భ్రాత కేనాఁడు లం
కా రాజ్య పట్టంబుఁ | గట్టి నావో!

గీ॥ అహహ! లోకాభిరాముఁడై | నట్టి నాటి
ఆమహాతేజ మానాఁడె | యస్తమించె
దండకారణ్య రాజ్య ప | దంబు విడచి
తిరిగి యేనాఁడ యోధ్యకున్ | మరలి నావో!

శంకను ధర్మమెక్కడ? ధర్మమను పేర నధర్మ భూతమున

శాత్రార్పణ మొనర్చు కొంటివి. ఆ పవిత్రధర్మదేవతా ప్రసన్నం ధానము మరల నీకీజన్మమున లభింపఁ జాలదు. — అయినను, నీవు నా యారాధ్యమూర్తివి. నా ధ్యానాధిష్ఠాన మూర్తివి. ఆ శ్యామ సుందర మూర్తివే నీవు. నీ యస్త్రాఘాతమున నేను మరణించి శాశ్వత ముక్తిఁ గాంచెదను. దేవాది దేవా! అస్త్రమును సంధింపుము.

శ్రీరా — (అస్త్ర సంధానముఁ జేసి) శంబుకా ! నీయపరాధమునకు ఈ దివ్యాస్త్రము నిన్ను భస్మీభూత మొనర్చి వాయు మండల మున లీనముఁ జేయుఁగాక !

(బాణము విడచును.)

(బాణముతోఁగూడ శంబుకుఁడు అదృశ్యుఁ డగును.)

తుంగ — హా ! హా ! ప్రభూ ! ప్రభూ ! (మూర్ఛిల్లును.)

తుంగ — (ఇంచుక స్పైపైన పిదప లేచి) రఘువంశ కళంకా ! నిష్ఠు రాత్మా ! పతివ్రతా శాపోపహతుఁడవు నీవు ! ముహూర్త మాత్రమైన నీకీజన్మమున శాంతి యుండదు ! అహోరాత్ర ము లాహార నిద్రా విహీనుండవై, సహస్రబంధు మధ్యమున నేకాకివై, మనస్తాప వహ్నిజ్వాలా మధ్యంగతుఁడవై, నీవు మరణము నపేక్షింతువు ! నరరూప రాక్షసా ! నీ ముఖముఁ జూచిన నరకము సంభవించును. నా సమక్షమునుండి తొలఁగి పొమ్ము.

శ్రీరా — దేవి ! అవనత మస్తకుఁడనై చేతులు మోడ్చి నీ యభి శాపమును ఆశీర్వాద ప్రాయముగ గ్రహించు చున్నాను. లక్ష్మణా ! రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

---

ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీ

# పృథ్వీపుత్రి

## తృతీయాంకము.

---

### స్థలము 1.

[ వాల్మీకాశ్రమము — వాల్మీకి సమక్షమున లవకుశులు ఆశ్రమ బాలురతోఁగలసి రామభజనముఁ జేయుచుందురు. ]

### శ్రీరామభజనము

భజనానంతరము బాలకులు నిష్క్రమింతురు.
లవకుశులు వాల్మీకి చెంత కేగుదురు.

లవు— తాతా ! నిన్నొక ప్రశ్నమడిగెదను. నాకు సందేహ నివృత్తిఁ జేయుము.

వాల్మీ— ఏమి సందేహము నాయనా ?

లవు — నీవు రచించిన రామాయణమునందు శ్రీరాముని పట్టమహిషి సీత యని వ్రాసితివి. ఆమె శ్రీరామునిచేఁ బరిత్యజింపఁబడి యరణ్యగామినియై దుఃఖ భాజని యైనదని రచించితివి. మఱి, మా యమ్మను గూడ సీత యనియే పిలచుచుంటివి. తాతా ! ఆ రామాయణ సీతయును, మా యమ్మ సీతయును ఏకవ్యక్తియే యగునా లేక భిన్న భిన్న వ్యక్తులా ?

వాల్మీ— (స్వగ) ఈ బాలకుని ప్రశ్నకు నేనేమని ప్రత్యుత్తర మీయఁగలను ?

లవు— ఏమి ఆలోచించుచుంటివి? తాతా ! నా ప్రశ్న మేమంత కఠినముగ నున్నదా ?

వాల్మీ— లవకుమారా ! సీత నా మానస పుత్రి. నా కల్పనా క్షేత్రము నందామె యావిర్భవించినది. ఆ మధురాక్షరములపై నాకుంగల యభిమానముచే నేను మీతల్లిని గూడ సీత యనియే పిలుచుచున్నాను.

కుశ— అట్లైన మాతల్లి సీత కాదా ?

వాల్మీ— కాకేమి ? మీ తల్లి కూడ సీతయే.

లవు— కాదు తాతా ! రామాయణమునందు నీవు వర్ణించిన సీత మా తల్లి కాదా ?

వాల్మీ— నాయనా ! ఆమె జగజ్జనని !

ఆ॥ వె॥ పరమ పుణ్య ధామ ! బ్రహ్మ రుద్రారాధ్య
చరిత ! సర్వలోక జనని యామె !
జగతి యెల్ల నామె సంసారమై యుండ
జనని కాదె మీకు మానవులార !

లవు— ఆహా ! తాతా ! అట్టి భువనైక పూజ్య యగు మహాసతిని లోకోత్తర చరిత్రుఁడైన నీ రాముఁ డెట్లు పరిత్యజించెను తాతా ? రామాయణమునందా సీతా విసర్జన ఘట్టమును బఠించునపుడెల్ల నా కన్నుల నేకధారగ బాష్పములు రాలుచుండును. అది యెంత హృదయ విదారకము ! (తదేక దృష్టితో నూర్ధ్వాభిముఖుఁడై) ఆహా ! అదే ! అదే ! ఆ మహాసతి! శ్రీరామాజ్ఞను శిరమున ధరించి యవనత వదనయై, అశ్రుధారా వర్షముఁ గురియుచు, అంతఃపుర ద్వారమునుండి వెల్వడుచున్నది ! అదిగో ! ప్రాసాద ప్రాంగణముల నిలచి యున్న రాజ

మాతృగణమునకు ఆ యభాగిని నమస్కరించు చున్నది !
మహారాజ మహిషి ! అయోనిజ సంభవ ! జగదేక పవిత్రి !
పూర్ణ గర్భ ధారిణి ! అంతఃపుర బహిష్కృతయై, సర్వభోగ
త్యాగినియై, సన్యాసినియై, శరీరమాత్రశేషయై, దిక్కుమాలిన
పక్షియై సింహద్వారమును సమీపించు చున్నది ! అదే !
లక్ష్మణచోదితమైన రథము ! అశ్రుధారాసిక్తయై యా మహా
దేవి రథారోహణ మొనర్చు చున్నది ! శోకాకులమైన పుర
నారీ లోక మంతయు నామెకు చరమ నమస్కారము చేయు
చున్నది ! రాజ మార్గమునంబడి, రథము మెల్ల మెల్లఁగా
బోవు చున్నది ! ఆయోధ్యానగర మంతయు హాహాకార
విఘూర్ణితమై చలించు చున్నది ! అదే ! అదే ! అనంత చక్ర
వాళమునందు రథము అదృశ్య మగు చున్నది ! ఏ పాపము
నెఱుంగని పరమ సాధ్వి ! నిష్కారణ బహిష్కృత ! భవిష్య
దంధకారము నందు లీనమగు చున్నది ! ... ఇంక నేను చూడఁ
జాలను ... చూడఁ జాలను ! అమ్మా ! అమ్మా ! పోయితివా?
పోయితివా ? (ఏడ్చును.)

వాల్మీ— నాయనా ! ఊరడిల్లుము. మెలకువఁ గల్గియే స్వప్నముఁ
గాంచుచుంటివా ?

లవు— స్వప్నము ! అగును. స్వప్న భంగ మైనది. కాని, తాతా!
నా యంతర్నేత్రములకు గోచరించిన యా మహాసతి సీతకును,
ఆశ్రమ వాసినియైయున్న మా యమ్మ సీతకును ఎట్టి సాదృ
శ్యము !

చం॥ అదె, నయనాబ్జ యుగ్మ, మదె!
యా ముఖ చంద్ర కళా విలాసముల్,
అదె, గమనంపు వాటు, మదె! ।
యా మృదులస్వర మాధురీ క్రమం

బదె, సకలాంగ శోభ ! యదె ।
యంతయు, భేద మొకింత లేదు; నా
హృదయ గుహాంతరాళమున ।
నీ మెయె యామె యటంచు మ్రొగెడిన్ !

వాల్మీ— నాయనా ! ఊహాప్రపంచమున మానసిక ప్రవృత్తి యత్యంత బలీయము. లోకపూజ్యయగు నా శ్రీరామ పత్ని యందు నీ కావిర్భవించిన మహాభిమానమే నీ యూహాదృష్టి యందు ఆమెకు నీ మాతృ స్వరూపమును బ్రసాదించినది ! ఇందు విచిత్ర మేమియును లేదు.

(ప్రవేశము — ఒక బాలకుఁడు)

బాల— లవకుమారా ! కుశకుమారా ! రండు. రండు. మన యాశ్రమ వనమందొక మహా సుందరమైన యశ్వము ప్రవేశించినది, చూచెదరు రండు.

లవ—కుశ— అశ్వమా ? అశ్వమా ?

లవు— తాతా ! పోయి ఆ యశ్వమెట్టిదో చూచి వచ్చెదము. దానిని కట్టివేయుటకే యత్నించెదను.

వాల్మీ— ఏమీ ! ఆ యశ్వమును నీవు పట్టఁగలవా ?

లవు— ఆ యశ్వమునే నేను పట్టలేనా ? తాతా ! క్షణములోఁ బట్టి తెచ్చెదను చూడుము. సోదరా, తాతకు సందేహనివృత్తిఁ జేయుదము రమ్ము.

(బాలకునితో నిష్క్రమింతురు.)

వాల్మీ— (స్వగ) ఈ క్షాత్ర సింహ కిశోరమున కాయశ్వ మెంత ? కానిమ్ము. భగవత్ సంకల్ప మనివార్యము ! ఈయల్పకార్యము వలన మహాభాగ్యమగు పితృ పరిచయ మీ రఘువంశాంకురములకు లభింప నున్నది !

సీ॥ క్రతుముక్తమైన యా । రాజాశ్వమును బట్టి
బంధించి తీఱు నీ । బాలకుండు ,
హయ రాజ రక్షా వి । హారి శతృఘ్నుండు
పనికి మాలిన మంటి । బంటు కాఁడు ,
అశ్వార్థమై విశ్వ । విశ్వాద్భుత రణంబు
తమసా తరంగ వా । ద్యముల మ్రోగు ,
ఆ చిత్రయుద్ధ ప । ర్యవసానముగ పితా
పుత్త్రి సమ్మేళనం । బు ఘటియిల్లు !
గీ॥ ఆ యపూర్వ సంఘటనా వి । ధేయ మగుచు
తనరు నామీది రామ క । థా క్రమంబు
కల్పనాతీత దైవ సం । కల్ప చక్ర
ధాటి కోర్వంగ వశమె వి । ధాతకైన ! !

( ప్రవేశము — సీత )

సీత — తండ్రీ !
వాల్మీ — అమ్మా ! రమ్మా.
సీత — గ్రంథము సమాప్తమైనదా ?
వాల్మీ — అమ్మా ! భారతీదేవి యనుగ్రహమున రామాయణ గ్రంథము సమాప్త మైనదనియే చెప్పవచ్చును.
సీత — తండ్రీ ! జానకి జీవనలీల యెట్లు సమాప్తిఁ జేసితివి? ఆ భావి లీలా చిత్రపటము నీ దివ్యహస్తముల నెట్లు చిత్రింపఁబడినదో చూడ మనసగుచున్నది !
వాల్మీ — తల్లీ ! భావిజీవన విషయికమగు ప్రశ్న నీయట్టి లోకోత్తరవ్యక్తికిఁ దగునా ? నీ మనోభావమును గుర్తించితిని. విరహసమ్మేళనములు క్షుద్ర మానవకోటికి విచారణీయములు కాని, లోకాతీతులగు సీతారాముల పట్లఁ గేవలము హాస్యాస్పదములు ! ఈ వాల్మీకియొక్క సీతారాములకు విశ్లేషము లేదు. వారి యాంతరంగిక సమ్మేళనము అవిభేద్యము ! అందు స్థలకాల దోష స్పర్శకు స్థానము లేదు. ప్రాపంచిక ఘటనా చక్రమున కది యతీతము తల్లీ !

సీత — మహాత్మా ! నా యజ్ఞానమును క్షమింపుము.

(నిష్క్రమించును.)

వాల్మీ — (స్వగ) నిశ్చయముగ నీమె పవిత్రమతి సహజమై యున్నది. కాని, అత్యంత జటిలము. ఈ విరహతత్త్వమును నేను వర్ణించలేకున్నాను. సీతారామ విరహము వర్ణించి యుంటిని సత్యము కాదా ? ఆ విరహవ్యథానిర్ఝరిణి నా రామాయణ గ్రంథమునందు శ్లోక శ్లోకము నందును బ్రత్యక్షరము నందును బ్రతిధ్వనించుటలేదా ? అప్రయత్నముగ నెన్నిఘట్టములయందు శోకవ్యథాక్రాంతుడనై నాదృష్టి చలించినది ! ఎన్ని సార్లు ప్రకంపితమైన నాహస్తమునందలి లేఖిని జారి పడినది! విరహవ్యథ నిశ్చయముగ మర్మభేదము!... ఆహా ! ఆనాటి క్రౌంచ విహగ సంఘటనము నాకిప్పుడు స్మరణకు వచ్చుచున్నది !

తే. గీ. ఎంత పతిని గోల్పడి । వింటి కెగసి
ఎంత క్రోశించె నాక్రౌంచ । కాంత యకట !
అదియె కద తొల్లి బీజాంశ । కారుణ్యమ్మె
ప్రాజ్ఞ వాల్మీకి కావ్య ప్ర । పంచమునకు !

కాని, సీతారాములకు విరహమేమి ? సీతారామ శబ్దము ఓంకారమువలె నభేద్యము !... సీతా !

(సీత తిరిగి ప్రవేశించును.)

సీత — తండ్రీ ! పిలచితివా ?

వాల్మీ — ఔనమ్మా ! నేను నేడు అయోధ్యకుఁ బోవుచున్నాను.

సీత — అయోధ్యకా ?

వాల్మీ — అగును. శ్రీరాముని జూచెదను. అతనికిని, నా కావ్యకథానాయకుఁడగు శ్రీరామునకును గల తారతమ్యమును బరిశీలించెదను. కల్యాణీ! వాల్మీకికావ్యకథాక్రమము యథార్థమో, లేక మిథ్యా కల్పితమో నేను తెలిసి కొనెదను.

సీత— (ఇంచుక సేపూరకుండి) తండ్రీ ! ఒక్క విషయము నిన్నుఁ బ్రశ్నింపఁ దలఁచితిని. క్షమించుము.

వాల్మీ— ఏ మది ?

సీత — అయోధ్యా సింహాసనమున కెవ్వ రుత్తరాధికారి యగును?

వాల్మీ— ఆ విషయము శ్రీరామునే యడిగెద నమ్మా !

సీత— (ముఖము వంచి నిలచి యుండును.)

వాల్మీ— సీతా ! శ్రీరామచంద్రుఁడిప్పు డశ్వమేధ యాగమును జేయనున్నాఁడు. ఆ యాగమునకు నే నాహ్వానింపఁబడి యున్నాను. ఆ కారణమున నే నిప్పుడ యోధ్యకుఁబోవుచున్నాను.

సీత— అగును. అయోధ్యనుండి వచ్చిన పత్రివాహకుని నేను చూచితిని ... అయోధ్యా నూతన పట్టమహిషికి జయ మగుఁగాక !

వాల్మీ— అయోధ్యా నూతన పట్టమహిషి ! నీ యభిప్రాయ మేమి?

సీత— తండ్రీ ! శాస్త్రవిధి ననుసరించి ఆ యజ్ఞవాటిక యందు రఘురాముల వామపార్శ్వమున నాసీన యగుట కే సతీమణి శ్రీరామునిచేఁ బునః పరిణీత యగునో యా సతీమణియే నూతన పట్ట మహిషి యని నా యభిప్రాయము.

వాల్మీ— అమ్మా ! శ్రీరామునకుఁ బునఃపరిణీత పత్నియా ? వాల్మీకి కల్పనా నేత్రమున కట్టిది కేవల మగోచరమైయున్నది.

తే॥ గీ॥ బాల ! వాల్మీకి కల్పనా । గోచర మందుఁ
గానఁగా రాని విషయ సం । ఘటన మొండు
పావనంబగు శ్రీరామ । జీవనమున
జరుగ నేరదు తల్లి ! ని । స్సంశయంబు !

నిర్విచారముగ నుండుము తల్లీ.

(సీత నిష్క్రమించును.)

వాల్మీ—(స్వగ) సీతాపతి యయోధ్యయందు లేఁడు. శ్రీరామ పత్ని యరణ్యమునందు లేదు. సీత శ్రీరాముని యందు లీనమై యున్నది. శ్రీరాముఁడు సీతాహృదయమునందు వసించి యున్నాఁడు. సీతారాములు ఏకైక తేజస్స్వరూపమై యీవాల్మీకి హృదయ సింహాసనముపై నుపవిష్టులైయున్నారు! ఓ మాయా మానుష విగ్రహా! నీ దర్శనభాగ్యమున నేను ధన్యుఁడ నయ్యెద.

(శ్రీరామ కీర్తనముఁ జేయుచు నిష్క్రమించును.)

---

## దృశ్యము 2

---

[ ఆశ్రమోపాంతము — ప్రవేశము: లవకుశులు ]

కుశ—సోదరా! ఆ యశ్వము ఫాలభాగమునఁ గట్టఁబడియున్న యా పత్రికను జూచితివా? అది నిశ్చయముగ రాజాశ్వమే! అశ్వమేధయాగ సందర్భమున దిక్సంచారముఁ జేయ విడువఁ బడిన రణాశ్వము!

లవు—అయిన నేమి?

కుశ—దీని పర్యవసానము యుద్ధమని నీకుఁ దెలియదా?

లవు—అగుగాక—యుద్ధము మనకొక యసాధ్యకార్యమా?

కుశ—కాదు కాని,

తే॥ గీ॥ పావనంబీ ప్రశాంత త | పోవనంబు
ఘోరసంగ్రామ రంగమై | ఘూర్ణిలఁజెందు!
పూవుఁదేనియల్ పారెడు | పుణ్యభూమి
నకట! రక్త ప్రవాహంబు | లావహిల్లు!

లవు—సోదరా! దానికి మనమేమి చేయగలము? అశ్వము నేమో కట్టితిమి కదా! పట్టిన యశ్వమును రణమునకు భీతిల్లి యిచ్చుట విడచి పుచ్చుట వీరులకు లక్షణమగునా?

కుశ—స్వయముగ అమ్మయే వచ్చి నిషేధించిన?

లవు— అమ్మ నిషేధించునా ? క్షత్రియ కాంత కాదా ?

కుశు— రాజాశ్వమును బంధించుట రాజున కవమానముఁ జేయుటయే యగును. అది రాజద్రోహముతో సమానము. రాజద్రోహము క్షాత్రధర్మమా ? ఇంతకును ఎవ్వరి యశ్వమును మనము పట్టితిమో తెలియునా ?

తే॥ గీ॥ తాత రచియించిన మహాక ♦ థాకృ మునన
నాయకుండు ! సీతా సతీ ♦ నాయకుఁడు !
రావణ విజేత ! త్రిభువనా ♦ రాధ్యుఁడైన
రామ భూపాలు సవనాశ్వ ♦ రాజ మిద్ది !

లవు— ఏమీ ! అయోధ్యాపతి శ్రీరాముని సవనాశ్వమా యిది?

కుశు— ఫాలపత్రికను నీవు చదువలేదా ?

లవు— అందేమి వ్రాసియున్నది ? ... ఆగుము. ఆ పత్రిక నిటుఁ దెచ్చెదను.

( పోయి పత్రికఁ దెచ్చును )

లవు— ఇదిగో పత్రిక — ( చదువును )

మ॥ రవి తేజః పరిరక్షితంబు, రణ వి ♦ క్రాంతం, బయోధ్యాధిరాట్
సవ నోత్సర్జితమా మహా హయవరం ♦ సం బద్ది ! బంధించి, యా
హవమున్ జేయుఁడు, దుర్నిరీక్ష్యమగు రా ♦ మా స్త్రోగ్ర కాలానల
చ్ఛవి కోర్వంగల వీరు లీ వసుమతీ ♦ చక్రంబునం దుండినన్ !

( అని చదివి, ఆనందముతో ) ఓహో ! నేఁడెట్టి సుదినము ! సోదరా ! ఈ పత్రికను జూచిన పిమ్మట నాకు రణోత్సాహము మఱింత యధికమైనది ! ఈ యశ్వమును నేనింక విడతునా ?

( ప్రవేశము — సీత )

లవు— అమ్మా ! మంచి సమయమునకే వచ్చితివి. నేఁడు నాకెట్టి సుదిన మమ్మా ! ఎట్టి మహావకాశము నేఁడు నాకు లభించెనో నీకుఁ దెలియునా ?

సీత— ఏమది నాయనా ?

లవు — అయోధ్యాపతి శ్రీరామునితో యుద్ధముఁ జేయుట కవకాశము కల్గినది.

సీత — (చకితయై) అయోధ్యాపతితో ... యుద్ధము !

లవు — అవునమ్మా ! అశ్వమేధ యాగముఁ జేయుచున్నాఁడఁట ! అదిగో, ఆ యజ్ఞాశ్వము ! చూచితివా యెట్లు బంధించితినో ! దాని ఫాలభాగమునఁ గట్టఁబడిన పత్రిక యిదిగో చూఁడుము. నిరపరాధినియైన మహాసతి సీతను నిష్కారుణముగఁ బరిత్యజించిన మహానీతిశాలి, యీ పత్రిక యందెన్ని గొప్పలు చెప్పుకొనినాఁడో చూఁడుమమ్మా; సిగ్గు లేక !!

(పత్రికను స్పష్టముగ వికటముగ వచనరీతిని చదువును).

సీత — (పత్రికను జూచి కొంచెమాగి) నాయనా ! ఆ జగదేక వీరునితో నీవు యుద్ధముఁ జేయుదువా ?

కుశ — నే నెంత చెప్పినను వినకున్నాఁడమ్మా. ఏమైనను అతఁడు లోకారాధ్యుఁడైన ప్రభువు కాఁడా ?

లవు — ప్రభువైన నేమి ? జగదేక వీరుఁడంటివి; ఆ జగదేక వీరత్వ మెట్టిదో నేను చూచెదను. అమ్మా ! అనుజ్ఞ నిమ్ము. ఏనాఁడు రామాయణమును దొల్లి పఠించితినో యానాఁడే ఆ శ్రీరామునితో యుద్ధముఁ జేయవలయునన్న సంకల్పము నాయందు జనించినది. ఇంత కాలమునకు ఆ సంకల్పము సిద్ధింపనున్నది !

సీ॥ సురగణంబు నుతింప । హర ధనుర్దండ భం
జన మొనర్చిన మహా । సత్వశాలి !
ఒక్క బాణాహతి । నొగి సప్తతాళ భే
దన మొనర్చిన మహో । దగ్ర ధన్వి !
ఖర దూషణాది శా । త్రవ యోధ యూథంబు
హత మార్చిన మహా ప । రాక్ర మార్చి !

దశ కంఠ కంఠ ర ♦ క్త స్నాతుఁడై పువ్వు
వృష్టిఁ దేలిన మహా ♦ వీర మాళి !

గీ॥ తల్లి ! యుద్ధమే చేయంగఁ ♦ దలఁతు సేని
అట్టి సర్వలోకైక వి ♦ ఖ్యాతుఁడైన
వైరి తోడఁడను బోరాడ ♦ వలయుఁ గాని
ఇతర నరకీటకములతో ♦ నేటి కమ్మ ?

అమ్మా ! రణోత్సాహినై యున్న న న్నాశీర్వదించి పంపుము.

సీత— నాయనా ! ఈ యభాగిని విచ్ఛిన్న హృదయమునఁ జిచ్చు రగిల్చెదవా ?

లవు— అమ్మా ! నీకు నమస్కరించెదను. నన్ను వారింపకుము యాగాశ్వమును బట్టితిని. యుద్ధము చేయక అశ్వమును విడువను. తల్లీ ! అనుమతి నిమ్ము.

కుశు— అమ్మా ! పోనిమ్ము. వీని కుత్సాహ భంగ మేల చేసెదవు? అనుమతి నిమ్ము. మే మిద్దఱమును ధనుష్పాణులమై యుద్ధరంగమును జొచ్చితిమేని ఫాలాక్షునకైన మమ్ము జయింప సాధ్యమగునా ?

లవు— సోదరా ! మన మిద్దఱమును గూడ నేల ? నే నొక్కఁడను చాలనా ?

సీత— (స్వగ) రఘు వీరునితో యుద్ధమా ? సాక్షాత్ జనకునితో సంగ్రామమా ! నే నేమని యనుమతి నీయఁ గలను ? — క్షత్రియ కాంతను ! శ్రీరామ పత్నిని ! వీర మాతను ! భీరుత్వమునకు స్థానము కలదా ? — పితా పుత్త్రుల యుద్ధము ! ఈశ్వర సంకల్ప మిట్లున్నదా ! హా ! జగద్రక్షకా ! ఎట్టి విషమసమస్య యందు నన్ను వైచితివి !

లవు— అమ్మా ! ఊరకుంటి వేమి ? అనుమతినిమ్ము. ఆశీర్వదింపుము.

సీత— (స్వగ) హా! ప్రభూ! సర్వాంతర్యామీ! నా మనో వ్యథ నీ వెఱుంగుదువు! నాకుఁ గర్తవ్య పథముఁ జూపుము.

(బాష్పములు రాల్చును)

లవు— అమ్మా! ఇట్టి శుభ సమయము నందు నీవు దుఃఖించెద వేమి? ఏమియును భయము లేదమ్మా! నా పరాక్రమము నీ వెఱుఁగవా?

సీ॥ చిన తనంబాది నే ♦ ర్చిన శరాసన కళా
గరిమ నింకెప్పుడు క ♦ న్పఱతు నమ్మ?
జన్మ సిద్ధంబైన ♦ క్షాత్ర తేజఃప్రభా
వముఁ జూప నెప్పుడింక ♦ సమయ మమ్మ?
తాత యిచ్చిన మహా ♦ త్తర దివ్య శస్త్రాస్త్ర
పటిమ నింకెప్పుడు చూ ♦ పఁగలనమ్మ?
సీతా కుమారు ల ♦ జేయు లందు విశాల
జగతి నింకెప్పుడు చా ♦ టఁగల నమ్మ?

గీ॥ రావణాంతకుఁడైన శ్రీ ♦ రాము వంటి
విశ్వ విఖ్యాతుఁడగు మహా ♦ వీరు తోడ
సమర మొనరింపఁగల మహా ♦ సమయ మింక
ఎన్ని జన్మంబులకు లభి ♦ యించు నమ్మ?

కుశు— అమ్మా! నిర్విచారముగ నాజ్ఞాపించుము. నిశ్చయముగ మా సమరవిద్యా ప్రదర్శనమున కిదియొక యమూల్యమగు నవకాశమే యగును. నీ యాశీర్వాదమే మాకు వజ్రకవచము. ఏమియును భయము లేదు తల్లీ!

సీత— అశ్వమున కంగరక్షకులై యెవ్వరు వచ్చిరి?

లవు— ఎవఁడో యొక సేనాపతి. ఎవ్వఁడైన నేమి? స్వయముగ శ్రీరాముఁడు మాత్రము రాలేదు. వచ్చియుండిన నెంత సులువై యుండునమ్మా! ముందీ సేనాపతిని గడప వలెను? ఆపైగదా శ్రీరాము నెదుర్కొనుట! కానిమ్ము—ఏమి చేయఁగలము?

సీత — (స్వగ) ఈశ్వర సంకల్పమనివార్యము. వీరపుత్త్రుల క్షాత్రోచిత కార్యమునకు నే నంతరాయముఁ గల్గింపఁ జాలను. (ప్రకాశము) కుమారులారా! మంచిది. యుద్ధయాత్రకుఁ బోయి రండు. సంగ్రామమునందు మీకు సర్వతోముఖ విజయము లభించుఁగాక! సీతాపుత్త్రులు యుద్ధమునం దజేయు లగుదురు గాక!

లవ-కుశ — (నమస్కరింతురు)

లవ — అయోధ్యాపతీ!

తే. గీ॥ నిరపరాధిని యైన మా ◆ పరమ సాధ్వి
కానలకుఁ బంపినట్టి నీ ◆ కఠిన హృదయ
మెట్టులోర్చునో చూచెద ◆ నింక మీఁద
నటుల సీతాసుత మహోగ్ర ◆ శస్త్ర ధాటి!

(లవకుశులు నిష్క్రమింతురు.)

సీత — తల్లీ! సర్వమంగళ ప్రదాయినీ! జగజ్జననీ! రక్షింపుము. రక్షింపుము.

సీ॥ ప్రాణనాథకంబైన ◆ రఘు కులేశ్వరుని మా
నసపద్మ మొక యింతి ◆ నవయకుండ,
పసి కందువుల ఫాల ◆ భాగంబు లం దున్న
సిందూరతిలకముల్ ◆ చెదరకుండ,
ఇరు పక్షముల ధను ◆ ర్ధర గణంబుల యందు
నొకఁడైన రణభూమి ◆ నొరగకుండ,
వీరసైనిక రక్త ◆ బిందు వొక్కటి యైన
వసుధా తలంబుపైఁ ◆ బడక యుండ,

గీ॥ జయ జయ ధ్వను లుభయ ప ◆ క్షముల మ్రోగ,
మంగళముల, పరస్పరా ◆ లింగనముల
చిత్రమైనట్టి యీ పితా ◆ పుత్త్ర సమర
మంత మొనరింపు మమ్మ! స ◆ ర్వార్థ నిలయ!!

(చేతులు జోడించి ధ్యానంగత యగును.)

## దృశ్యము 4.

[ ఆశ్రమోపాంతము — ప్రవేశము లవకుశులు. కొందరు బాలకులు ]

---

లవు — సోదరా! ఇంక నతి స్వల్ప కాలములోనే యుద్ధము ప్రారంభమగును. ఆశ్రమము నిస్సహాయమై యున్నది! తాత విదేశగామియై యున్నాఁడు. నీవు ఆశ్రమ రక్షణముఁ జేయుము. అమ్మకును, ఆశ్రమ వాసులకును ఎట్టి హానియు జరుగకుండ నీవు కాపాడుము.

కుశు — మఱి నీవు?

లవు — నేను పోయి యా సేనాపతి నెదుర్కొందును.

కుశు — నీవు పోనేల? ఆ సేనాపతియే యశ్వము కొఱకు మన యొద్దకు రాక తప్పదు కదా!

లవు — అగును. కాని, విలంబమేల కావలెను? ఆతఁడు వచ్చి మనల యుద్ధమున కేల యాహ్వానింప వలెను? ఆ ప్రథమ నిమంత్రణ గౌరవము మనమేల యాతనికి విడువవలెను?

బాలకులు — ఔను. అంతే.

కుశు — (ప్రక్కకుఁజూచి) అదిగో, ఆ సేనాపతియే కాఁబోలు నిటు వచ్చుచున్నాఁడు.

లవు — (చూచి) మంచిది. నీ వింకఁబోయి యాశ్రమమున నుండుము. బాలకులారా! మీరుకూడ పొండు.

ఒక బాలుఁడు — లవ కుమారా! నన్నుమాత్రము నీవెంట నుండ నిమ్ము. నవ్వులాటకైనఁ బనికి వత్తును. బాలకులారా! మీరందఱును పొండు కుశుని వెంట. ఆశ్రమము జాగ్రత్త!

( కుశుఁడు, బాలకులు, నిష్క్రమింతురు )

( ప్రవేశము — శత్రుఘ్నుఁడు, ఇద్దఱు భటులు )

శత్రు—(లవునిఁజూచి) బాలకా! నీవేనా మా యశ్వమును బట్టిన బాల వీరుఁడవు?

లవు— ఎట్లు గుర్తించితి వయ్యా? (నవ్వి) నీవేనా యశ్వము కంగరక్షకుఁడవై వచ్చిన సేనాపతివి?

శత్రు—అగును. (లవుని తేరిచూచుచుండును).

లవు—(బాలకునితో) ఓయి బ్రాహ్మణవీరా! ఈ సేనాపతితో నీవు యుద్ధముఁ జేయఁగలవా?

బాల—నీ చేతికి మించినప్పుడు కదా నేను? ముందు నిన్ను గెలువ నిమ్ము. ఆపై నా బ్రాహ్మణశక్తి చూడఁగలఁడు.

శత్రు—(విస్మయముతో, స్వగతము) ఎవ్వఁడీ బాలకుఁడు?

తే॥ గీ॥ భువనమోహనమైన యీ ◆ ముఖముతీరు,
నీలరత్నచ్ఛటల నీను ◆ నేత్రయుగము,
అమృతరసమొలుకు మధురకం ◆ ఠారవంబు,
స్మరగణమును దెమ్పు నా మహా ◆ సాధ్వసమహా!

లవు—ఏమయ్యా, అట్లు దిగ్భ్రమఁజెంది చూచుచున్నావు?

బాల—మన మిద్దఱమును ఈతనికి రెండు పెనుభూతములవలెఁ గనఁబడుచున్నాము కాఁబోలునోయి లవకుమారా! (నవ్వుచు) మేము భూతములము కామయ్యా, భయపడకు.

శత్రు—(లవునితో) బాలకా! లోకాభిరామమైన యీ మధుర మోహనాకృతి నీకుఁగల్పించిన మాతాపితరు లెవ్వరు?

లవు—సేనాపతీ! నీవు యుద్ధముఁ జేయుటకు వచ్చితివా, లేక, ముక్కులు మోములుఁ జూచుటకు వచ్చితివా? నీ ప్రభుని యజ్ఞాశ్వమును నేను బంధించితిని. అధిక ప్రసంగమేల? రెండే ప్రశ్నలు.

మ. ముదమారన్ బ్రభుకార్య ధూర్వహుఁడవై ♦ మ్రోగించి కోదండమున్,
గదనక్షేత్రముఁ జొచ్చి శౌర్యమున సం ♦ గ్రామంబె కావింతువా ?
పదిలంబారఁగ నీ భుజోపరి ఘను ♦ ర్బాణంబులన్ దీసి, నా
పదయుగ్మంబున వైచి సాగిలి నమో ♦ వాకంబె కావింతువా ?
చెప్పుము,

బాల—అంతే ఏదో యొకటి చెప్పుము.

శత్రు—బాలవీరా ! సత్యముగ నీవు నాతో యుద్ధముఁ జేయుటకే సంకల్పించుకొని యుంటివా ?

బాల—అదిగో, తిరిగి యధిక ప్రసంగమునకు దిగుచున్నాఁడు చూఁడు.

లవు—పోయి త్వరలో నీ సైన్యములను సిద్ధముఁ జేసికొనుము.

శత్రు—(స్వగ) ఈ బాలకుని ముఖదర్శన మాత్రమున నా సర్వాంగమును నిస్తేజమై నిర్వీర్యమగుచున్న దేమి ? ఈ పసి బాలు నాలింగనముఁ జేసికొన నా కిచ్ఛ పొడముచున్నది ! తీక్ష్ణములగు శరాఘాతములచే నవనీతకోమలమగు నీవక్షము నెట్లు భేదింపఁగలను ? నా శరీర మాపాదకమస్తకమును వివశమగుచున్న దేమి ? శతకోటి ప్రవిస్తరమైన శత్రుసైన్యము నెదుర్కొనునప్పుడైన లేనిది యీ హృదయచాంచల్య మేమి ?—బాలకా ! నీతో యుద్ధముఁ జేయుటకు నా కిచ్ఛ పొడమకున్నది! నిన్నుఁ జూచినంత నే నా హృదయము ద్రవీభూత మగుచున్నది.

లవు—(పకాలున నవ్వి) ఇదియా అయోధ్యావీరుల తత్వము ? లోకైకవీరుఁడని ప్రసిద్ధిఁ గాంచిన శ్రీరాముని సేనాపతివేమో ! (పకపక నవ్వి) ఇట్టి స్త్రీ హృదయముతోఁడనా నీవు యజ్ఞాశ్వ

మున కంగరక్షకుఁడవై వచ్చితివి ? పొమ్ము. పొమ్ము. పోయి మీ మహారాజుతో నిట్లు చెప్పుము.

సీ॥ తమసా ప్రవాహ తీ ♦ రమున వాల్మీకి మ
హర్షి దివ్యాశ్రమం ♦ బలరు ననుము,
ఆ పుణ్యభూమి యం ♦ దవతారము ధరించి
శ్రీ మహాలక్ష్మి వ ♦ సించు ననుము,
ఆ యమ్మ రెండు సిం ♦ హంపుఁబిల్లల నెంతొ
యుత్సాహమునఁ బెంచు ♦ చున్నదనుము,
అవి ఫాలనేత్ర కా ♦ లానలోద్ధతి కైన
జడియని బెడిదంపు ♦ పిడుగు లనుము,

గీ॥ అందొకటి కట్టువిడి విలా ♦ సార్థముగను
తనదు పవనాశ్వమును బట్టు ♦ కొనియె ననుము,
భీమ సంగ్రామభూమి యం ♦ దేమొ కాని
పట్టిమాటలఁ దన పట్టు ♦ వదల దనుము!

బాల — ఆపై నాతఁడే వచ్చునో, మఱియొకని నంపునో, గుఱ్ఱమును విడిపించుకొనుటకు ! పొమ్ము. పొమ్ము. శీఘ్రముగఁ దెలియఁ జేయుము. ఓహో, అయోధ్యావీరులనఁగా నెట్లుందురో యనుకొంటివి !

శత్రు — బాలకా! నీకు రణోత్సాహ మధికముగనున్నట్లు తోచుచున్నది! యుద్ధము తప్ప అన్యచింత నీ హృదయమున లేనట్లు కన్పట్టుచున్నది! — కానిమ్ము, నీ యభిలాషకు నేనేల విఘాతముఁ గల్గించవలెను ? ఏదీ నీ కేమైన సైన్యమున్నదా ?

లవు — సైన్యమా ? నేనేమి మహారాజు బిడ్డనా—నాకు సైన్యముండుటకు ? కేవలమొక తాపస బాలకుఁడను. ఆశ్రమవాసిని ! పోనిమ్ము. సైన్యసమేతుఁడవగు నీతో నేను ఏకాకినై యుద్ధము జేసెదను రమ్ము.

బాల—ఇదిగో, నా సహాయముకూడ నీతని కవసరములేదు, మఱి చూడుము.

శత్రు—బాలకా! అసంఖ్యాకమైన మహాసైన్యముతో నీ వేకాకివై పోరెదవా? నీ మాటలకు నాకు నవ్వువచ్చుచున్నది!

బాల—నవ్వువచ్చుచున్నదా? (పకపకనవ్వి)–నవ్వు.–నవ్వు. ఎంత నవ్వఁగలవో యిప్పుడే నవ్వు. తరువాత మఱి నవ్వుట కవకాశముండదుసుమా.

లవు—అయ్యా! నీ సైన్య మసంఖ్యాకమే యగుఁగాక. నే నేకాకినే యగుదును గాక. బలాబల నిరూపణము ఫలితములపైఁ గదా యాధారపడియుండును? ఇంతకును, ఈ యధిక ప్రసంగ మేల? యుద్ధముఁ జేసెదవా? తిరిగి పోయెదవా?

బాల—అంతే. రెండే ప్రశ్నలు. చెప్పు.

శత్రు—బాలవీరా! నీ పౌరుష వాక్యములు నా కాశ్చర్యముఁ గొల్పుచున్నవి!

లవు—వాక్యములే నీ కాశ్చర్యముఁ గొల్పుచుండ, మఱి కార్యములకు నీ మేన చైతన్యమే వదలి పోవునేమో!

శత్రు—కుమారా! నిన్నుఁ జూచినది మొదలు నా చిత్తము చలించుచున్నది.

బాల—సరే! ఉఁ! లవకుమారా! పాపము, ఇతనిని విడచివేయుము. ఇంత చలించిపోయిన యీతని నింక బాధపెట్టుట తగదు.

శత్రు—అజ్ఞాతమును, అదృశ్యమును అగు నొకానొక బలీయ ప్రేమపాశము నన్ను బంధించి నీ దెస కీడ్చివేయుచున్నది. ఏ మహాతేజః ప్రభావముచే నీ విప్పుడు తేజస్వివై నన్నెదుర్కొనుచుంటివో నే నూహింపఁజాలకున్నాను.

లవు—అగును. ఆ మహాతేజః పరిభావమును నీ వూహింపజాలవు.

సీ॥ ఏ దుర్నిరీక్ష్య తే • జోదర్ప మఖిల దిక్
దంతావళములకున్ • గన్నుమూత !
ఏ హుతాశార్చి దు • ర్దాహంబునకు సప్త
జలనిధుల్ శూన్యశ్మ • శాన తటులు !
ఏ పరిపంచాతీత • దృక్ప్రసారమునకుఁ
బంచభూతములు ని • ష్ప్రభనములు !
ఏ దుర్జయ ప్రభా • హేలాభిరతికి న
క్షత్ర మండలము రం • గస్థలంబు !

గీ॥ ఆ మహాశక్తి ! యపరాజి • తాత్మశక్తి !
మాతృదేవ తాశీర్వాద • మహితశక్తి !
సర్వశక్తి సంపూర్ణమా • సాధుశక్తి !
కదనభూమిని నేఁడు చూ • చెదవుగాక !

శతృ—కానిమ్ము. విధివిధానము అవిలంఘనీయము. నా విధ్యుక్తమును నేను నెఱవేర్చవలయునుగదా. ఈ బుష్యాశ్రమో పాంతము రణమునకు యోగ్యస్థలముకాదు. అదే యాశన్న డుచున్న సముద్ర ప్రదేశమునకుఁ బోవుదమురమ్ము

లవు—మహానంద్ధమైనది. ఇప్పటికిక దా నీవొక వీరునివలె మాటాడితివి ! సేనాపతీ ! నడువుము.

బాల—లవకుమారా ! అక్కడికి నేనుకూడ రావలెనా యేమి ? ఇక్కడ నేను నిలచి మీ యుద్ధమును కనిపెట్టుచుండెదను.

లవు—(నవ్వి) పిరికిబాపఁడా. అట్లే కానిమ్ము, ఇచ్చటనేయుండుము.

(శతృఘ్నునితో నిష్క్రమించును.)

బాల—(స్వగ) అమ్మయ్యా! బ్రతికితిని; కాదు నావెంటరమ్మన్న? నాగతి యేమైయుండును ? ఆహాహా ! భగవంతుఁడు మహా

గొప్పవాఁడు! (చేతులుజోడించుచు) నిజముగా భగవంతునివంటి మనిషి లేఁడు !

(తెరవాలును.)

---

## దృశ్యము 4

---

ఆశ్రమవనము — [ప్రవేశము: కుశుఁడు]

కుశు— (స్వగ) ఏకాకియై యసంఖ్యసైన్యము నెదుర్కొనఁ బోయిన లవకుమారుని జాడ యేమియుఁ దెలియకున్నది ! ఆ మహాసైన్యము నసహాయముగ నీతఁ డపరోధింపఁ గల్గియుండునా ? నా హృదయము చలించుచున్నది.

తే॥ గీ అతి భయానకల చిత్తయై ♦ యాశ్రమమున
నేక ధారగ జనయిత్రి ♦ యేడ్చుచుండె;
అకట ! తోఁడు నీవ్వక సమ ♦ రాంగణమున
ఏల పడి యుంటి నిచట ని ♦ శ్చేష్టకముగ !

బాల—(ప్రవేశించి) కుశకుమారా ! అదిగో, మన లవుఁడు వచ్చుచున్నాఁడు.

కుశు— (ఆత్రముతో) ఏఁడీ ? (పరికించుఁజూచుచు) ఆహా ! మందహాస విలసితమైన యీ ముఖము విజయమునే సూచించుచున్నది !

( ప్రవేశము — బాలకునితో లవుఁడు )

కుశు— వచ్చితివా, సోదరా! (కౌఁగలించుకొని) యుద్ధమేమైనది?

లవు— (నవ్వుచు) ఏమైనది ? ఏమి కావలెనో యది యైనది !

బాల— కుశకుమారా ! నేనుండఁగా నేమి కాఁగల దనుకొంటివయ్యా ? లవకుమారుఁడొక పరీక్ష — నే నొక పరీక్ష — తెలియునా ? ఇంక హరిహరాదులకైన మా వ్యూహమునం

దడుగు పెట్టుటకు సాధ్యమా? (ఇతర బాలకులను జూపుచు) ఈ పిరికి పీనుఁగు లెవ్వరైన ఆ యుద్ధము వైపుఁ జూడనైనఁ జూడఁ గలరా ? (పక పక నవ్వును).

లవు— సోదరా ! యుద్ధమే జరుగలేదు. తొలుత వాయవ్యాస్త్ర ప్రభావమును జూపితిని.

తే॥ గీ॥ క్షణములో నా మహాసైన్య ♦ సముదయంబు
కట్టు తెగి యంతరిక్ష మా ♦ ర్గమున కెగసి
వసుధ కంపింపఁ దిరిగి భూ ♦ పతన మయ్యె
నర కళేబర వర్షంబు ♦ కురిసి నట్లు !

బాల— కుశకుమారా ! ఆ చిత్రమును నీవు చూచి తీరవలసిన దయ్యా ! గాలి దుమారమునందుఁగలసి యా సైన్య మంత యు నాకాశమునం దూగిన యా యుయ్యాలలు, పెట్టిన యా మొఱ్ఱలు, మఱి వర్ణింప లేనయ్యా !

లవు— పిమ్మట సమ్మోహనాస్త్ర ప్రయోగమున సేనాపతి సమేతముగ సమస్త సైన్యమును సమ్మూర్ఛిత మొనర్చితిని. తమసా తీరమునం దా సైన్యమంతయు నిప్పుడు నిశ్చేష్టమై పడియున్నది! ఈ యస్త్రప్రభావమున మూడు రాత్రులు గడచు వఱకు నట్లే పడియుండును. పిమ్మట తిరిగి చైతన్యముఁ గాంచును.

కుశ— రమ్ము. ముందు అమ్మను జూచి వత్తము రమ్ము. అత్యంత భయాకులయై యేడ్చుచున్నది.

లవు— ఏడ్చుచున్నదా ? ఏమి ? నాశక్తిని శంకించినదా ? సోదరా ! నీవు పోయి యామెకు నా యభివందనము లర్పించి, సమస్తమును నివేదించి యోదార్పుము. నే నిప్పుడామె యొద్దకు రాను. నా కార్యమింకను బూర్తి కాలేదు. ఇప్పుడు నే నయోధ్యకుఁ బోవలెను.

కుశ— ఏల ?

లవు— యజ్ఞాశ్వ మిచ్చట బంధింపఁబడియున్న వృత్తాంతము అయోధ్యా పతికిఁ దెల్పుటకు, పాపము, అతని సైన్యమునం దొక్కఁడును సచేతనుఁడై మిగిలి యుండలేదు. నేనే స్వయ ముగ నయోధ్యకేగి యావద్వృత్తాంతమును రాజున కెఱిఁగించి వచ్చెదను. ఆ యజ్ఞాశ్వము నధిరోహించియే పోయెదను.

కుశు— అమ్మ నిన్నుఁజూడ మిక్కిలి వ్యాకుల పడుచున్నది.

లవు— ఆమెను నీ వోదార్పుము. నేను వాయు వేగమునఁ దిరిగి వచ్చెదను.

కుశు— సోదరా! ఆ మాత్రము వార్తఁ దెల్పుటకు ఇంకెవ్వరినైన నయోధ్యకుఁ బంపినఁ జాలదా?

లవు— అటు కాదు సోదరా? కేవలము వార్త నివేదించుటకే నేను పోవుట లేదు.

తే॥ గీ॥ ధర్మపత్ని పరిత్యాగ • దక్షుఁడైన
ఆ మహారాజు రూపు నే • నరసి వత్తు
ఆ శరీరంబు రక్త మాం • సాస్థి మయమొ
నిష్ఠుర కఠోర పాషాణ • నిర్మితంబొ!

నీ వమ్మను జూచిరమ్ము. (పోఁబోయి తిరిగి చూచి) ఇదిగో, సోదరా! పాపము రాజసైన్యమంతయు మూర్ఛాగతమై పడి యున్నది! గృధ్రి శృగాలములచే నా సప్రాణ కళేబరములకు హానికలుగకుండ నీవు కాపాడవలయును సుమా!

భాలు— అచ్చట నేను కాపుండెదను లెమ్ము.

కుశు— అల్లే కాపాడెదను. కాని, సహోదరా! శీఘ్రముగ రావలయును సుమా! అయోధ్యాపురీ సౌధ గోపుర సౌభాగ్య మును జూచుచు, ఈ పర్ణకుటీరమును మఱచి పోఁగలవు!

లవు— అది కేవల మసంభవము!

ఆ॥ వె॥ జన్మభూమి ! మాతృ ♦ చరణ పుష్ప పరాగ
శోభితంబు ! గురుప ♦ దాబ్ధి రామ
మీ కుటీర సీమ ♦ కెన యౌనె భువి నెన్ని
కోట్ల యోధ్యలైన ♦ కుశకుమార!

(ఇరువురును చెరియొకవైపు నిష్క్రమింతురు.)

బాలు — (స్వగ) లవకుమారుఁడు నన్నుఁగూడ గుఱ్ఱముపై నెక్కించుకొని యయోధ్యకు తీసుకొని పోయిన నెంత బాగుండును ! ఊఁ ! పోనిమ్ము, గుఱ్ఱముపై ప్రయాణము చాల ప్రమాదకరము. అందు, లవకుమారుని తోఁడనా ? ... అమ్మయ్యో !

(నిష్క్రమించును.)

---

ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీ

# పృథ్వీపుత్రి

## చతుర్థాంకము

### దృశ్యము 1.

[ అయోధ్యా రాజమందిరము — ప్రవేశము — ఏకాకియై శ్రీరాముఁడు ]

శ్రీరా— (స్వగతము) దేవీ! తుంగభద్రా! పతివ్రతామణీ! నీ యభిశాపఫలమును సంపూర్ణముగ నే ననుభవించెదను. ముహూర్తమాత్రమైన నా కీ జన్మమున శాంతియుండదు. అహోరాత్రము లాహార నిద్రావిహీనుండనై, సహస్ర బంధుమధ్యమున నేకాకినై, మనస్తాప వహ్నిజ్వాలా మధ్యంగతుండనై, మరణము నపేక్షింతును. దేవీ! నీహృదయమును విదారణ మొనర్చి నే నార్జించిన యభిశాపవాక్యమునం బ్రత్యేకాక్షరమును మహాఫలప్రదమై యున్నది! ఈ విశాల జగతియందు నేను కేవల మేకాకినై యున్నాను. నాకు బంధు వనఁదగు ప్రాణి యీ ప్రపంచమున లేదు. నా భవిష్యజ్జీవన మంధకార మయము! సర్వశూన్యమగు శ్మశానము!

( వశిష్ఠ మహర్షి ప్రవేశించును — శ్రీరాముఁడు అభివాదముఁ జేయును)

వశి— వత్సా! అశ్వమేధమునకు సర్వమును సన్నద్ధమగుచున్నది. నిమంత్రణ కార్యభారమంతయు సౌమిత్రివహించెను. అశ్వముతో సైన్యసమేతముఁగ శత్రుఘ్నుఁడు పోయి యున్నాఁడు. నంది గ్రామమునుండి భరతుఁడు నేఁడో రేపో రాఁగలఁడు.

శ్రీరా — గురుదేవా ! యజ్ఞ సన్నాహమంతయు నిల్పివేయుఁడు. యజ్ఞము జరుగనేరదు.

వశి — అదేమి ?

శ్రీరా — మతి చాంచల్యమున, అశ్వమేధమునకుఁ దొల్లి యంగీకరించితిని. యజ్ఞానుష్ఠానము కేవల మసంభవము.

వశి — అసంభవమా ? ఎట్లు ?

శ్రీరా — ఎట్లో సకాలమునఁ దమకు నివేదింపఁగలను. ప్రస్తుతము సర్వప్రయత్నములను విరమింపుఁడు.

వశి — రఘురామా! ఏకాకివై, ఏకైకచింతా పరితప్త హృదయుండవై, అహోరాత్రము లంతఃపురమును విడువకుంటివి. సభాస్థానమునందు బహుకాలమై నీ దర్శనభాగ్యము లేక ప్రజాగణము వ్యాకుల పడుచున్నది.

శ్రీరా — మునీంద్రా ! నేను మిక్కిలి యస్వస్థుఁడనై యున్నాను. కొంతకాలము నాకు ఏకాంత విశ్రాంతి కావలయును. ప్రజాగణము నన్ను క్షమించుఁగాక !

వశి — వత్సా ! నీ యస్వస్థతకుఁ గారణమేమి ?

శ్రీరా — గురుదేవా ! దుఃఖితుఁడను నేను. ఈ జీవన సంగ్రామమునందు నా ప్రాణములు మిక్కిలి యలసియున్నవి. నాకు విశ్రాంతి కావలయును. రాజభక్తిపరాయణులగు అయోధ్యాపురవాసులు తమ ప్రభువునకీ విశ్రాంతిని సహితము నీయ నొల్లరా ?

వశి — రఘురామా ! నీ యట్టి ప్రభుసత్తము లిట్లనఁ జెల్లునా ? రాజకార్యమున విశ్రాంతికి స్థానము లేదు.

శ్రీరా — రాజకార్యములు ! ... రాజకార్యములు కాక మనుష్యప్రాణికింక జీవనమునం దన్యకార్యములు లేవా ? జాగరణము

నందును, నిద్రయందును, స్వప్నములందునుగూడ రాజకార్య ప్రసక్తియే కావలెనా ? గురుదేవా !

ఉ. జనపతియైన జన్మసహ ♦ జం బగు నూర్జిత మానుషత్వమున్
మనుజుఁడు మంటఁ గల్పికొని ♦ మాఱునె కేవల యంత్రమూర్తిగన్ !
అనఘ ! కిరీట ధారి యయి ♦ సంతనె మానస ధర్మఘాతియై
అనవరతాత్మ శాంతియయి ♦ యా మరణంబుఁ దపించుచుండునే !

వశి— వత్సా ! శాంతింపుము. ఆదర్శమూర్తివైన నీ కిట్టి హృదయ దౌర్బల్యము తగదు.

శ్రీరా— ఆదర్శమూర్తిని ! ... ఆదర్శమూర్తిని ! ... అగును. అగును. మీ యాదర్శ రక్షకై స్వహస్తములతో నా హృదయగోళమును వక్షః కుహరమునుండి పెకల్చివైచితిని ! మీ యాదర్శ రక్షకై నిరపరాధియగు శంబుకుని హత్యఁ గావించితిని! ఆదర్శమూర్తిని ! ఆదర్శమూర్తిని నేను ! హహ్హాహా!

వశి— రామచంద్రా ! ఇట్టి విపరీతావస్థ యీ వఱకు నీ యెడ నేను చూచియుండలేదు. ఏమి సంభవించినది వత్సా? (చేతులుపట్టుకొని) నాతో సత్యముఁ బల్కుము. జానకీదేవి నీ స్మృతిపథమునఁ బడియుండనోపు !

శ్రీరా—(ఉత్తేజితుఁడై) గురుదేవా ! గురుదేవా! ఆ నామాక్షరముల నుచ్చరింపవలదు. ఆ నామస్మృతి మాత్రమున రాజధర్మము కళంకితము కాఁగలదు ! రాజధాని యపవిత్రము కాఁగలదు ! చరణములంటి ప్రార్థించెదను, గురూత్తమా ! ఆ సీతానామ స్మరణముఁ జేయవలదు. వశిష్ఠ సహితముగ అయోధ్యావాసులకు ఆ నామోచ్చారణమున కధికారము లేదు. క్షమింపుఁడు.

వశి—వత్సా ! నీ నితాంత శ్రేయోభిలాషినగు నా యుపదేశము నాలింపుము. అశ్వమేధమును బూర్తిగావింపుము. నీ హృదయ క్లేశములన్నియు నివారణము లగును.

శ్రీరా—మునీంద్రా ! అశ్వమేధ మెట్లు పూర్తి కాఁగలదు ? సర్వశాస్త్ర పారంగతులగు తా మెఱుంగని దేమున్నది ? శాస్త్రవిధానము పాలింపఁబడవలయును కదా !

వశి—అగును. యజ్ఞానుష్ఠానమునకు సహధర్మచారిణి చెంతనుండ వలయును. ఉపాయమేమైన నూహింతము. యజ్ఞభంగమైనచో బ్రజాగణము నిరాశాహతమై పోవును.

శ్రీరా—నేనేమి చేయఁగలను మునీంద్రా ! ఎంతవఱకు సాధ్యమైనదో అంతవఱకును బ్రజానురంజనముఁ గావించితిని. ఈ యజ్ఞానుష్ఠానము నా శక్తి కతీతమైనది ! నేనేమి చేయఁగలను ?

( ప్రవేశము – కౌసల్య )

కౌసల్య—నాయనా! అది యంత శక్తి కతీతమైన కార్యము కాదు.

వశి—దేవీ ! నీ యభిప్రాయ మేమి ?

కౌసల్య—స్వర్ణసీతా విగ్రహమును నిర్మించి శ్రీరాముని వామ భాగమునందు నిలిపి యజ్ఞపూర్తిఁ జేయవచ్చును.

శ్రీరా—స్వర్ణసీతా విగ్రహము !... జానకి సువర్ణప్రతిమా నిర్మాణమునకు నేను సమ్మతింపవలయునా ? బహిస్స్వరూపమే ప్రధానమా ?

వశి—వత్సా ! శాస్త్రనియతి యంతటితో సంతృప్తిఁ బొందఁ గలదు.

శ్రీరా— శాస్త్రనియతి !... శాస్త్రనియతి !... బహిస్స్వరూ పమే ప్రధానము ! ఆత్మతేజోవిహీన నిర్జీవకంకాళమే శాస్త్ర నియతికి ప్రధానము !

కౌసల్య—నాయనా ! సంకల్పమెట్లో సంపూర్ణము కావలయును కదా! సమర్థులగు శిల్పుల రావించి సీతావిగ్రహ నిర్మాణముఁ గావింతము.

శ్రీరా—సమర్థుఁడైన శిల్పి ! తల్లీ ! సీతాస్వరూప నిర్మాణముఁ
జేయఁగల శిల్పి చతుర్దశలోకముల నొక్కఁడైనఁగలఁడా ?

తే॥ గీ॥ శిల్పులకు శిల్పి ! యఖిలాండ • సృష్టికర్త
బ్రహ్మకైన సీతామూర్తి • వశమె తల్లి !
మహిత సీతాస్వరూప ని • ర్మాణమునకు
నింక నతఁడెన్ని జన్మంబు • లెత్తవలెనొ !

అమ్మా ! ఆ సువర్ణసీతను నిర్మింపఁగల సమర్థుఁడు బ్రహ్మాండమునం దొక్క శ్రీరాముఁడు తప్ప వే ఱొక్కఁడు లేఁడని గ్రహింపుము.

కౌసల్య—కానిమ్ము. ఆ స్వర్ణవిగ్రహమును నీవే నిర్మింపుము.

శ్రీరా—(యోచించి) మంచిది. నేనే స్వయముగ దానిని నిర్మించెదను. అహోరాత్రములు నిద్రాహారములులేక ఏ పవిత్రమూర్తిని నేను ధ్యానించుచుంటినో, ఆ లోకోత్తరమూర్తిని నేనే స్వయముగ నిర్మించెదను. అన్యులకది భావనాతీతము ! అసాధ్యము! ఆ సువర్ణమూర్తిని నిర్మించి దానికిఁ బ్రాణప్రతిష్ఠ యొనర్చెదను !

కౌసల్య—నాయనా ! అట్లనే కానిమ్ము.

వశి—వత్సా ! నీ మనోభీష్టము సిద్ధించుఁ గాక !

( కౌసల్య, వశిష్ఠుఁడు నిష్క్రమింతురు. తెర వ్రాలును. )

## దృశ్యము ౨

[ రాజమందిరము — శ్రీరాముఁడు సీతాధ్యానమగ్నుఁడైయుండును. ]

శ్రీరా— (ఉన్మత్తుని వలె) అదే! అదే! అదే, ఆ జగన్మోహన మూర్తి! అదే, ఆ సర్వమంగళ స్వరూపము! అదే, అదే, ఆ జగత్పావని! హా! సీతా! సీతా! సీతా!

(బాష్పములు రాల్చును.)

(ప్రవేశము — కౌసల్య.)

కౌస— తండ్రీ!

శ్రీరా— అమ్మా! వచ్చితివా! అదిగో, అదిగో, ఆ లోకోత్తర మూర్తినిఁ జూడుమమ్మా! ఇదిగో, నా హృదయ ద్వారము నందెట్లు మందహాస వదనయై నిలచియున్నదో చూఁడుము.

కౌస— (స్వగ) ఇదేమి! ఈ యున్మత్తవైఖరియేమి? భగవన్! భగవాన్! ఈ విపరీతానుభవమునకా నే నింకను జీవించి యుంటిని! (కన్నుల నీరు నించును.)

శ్రీరా— అమ్మా! అదేమి! ఏడ్చుచుంటివేమి? నేఁడు మనకు మహా శుభదినము! నా హృదయాధిష్ఠాన దేవత నా హృదయ మందిరమును నేఁడు విరాజమాన మొనర్చుచున్నది! నేఁడు నా సమస్తమానస క్లేశములకు నవసాన దినము! ఆ మనోహర విగ్రహమును జూఁడుమమ్మా! దివ్యాంబరాభరణ భూషిత యగు రాజమహిషి యనుకొంటివా? కాదు. దివ్య తేజోరాసి యగు తపస్విని! జీర్ణవల్కల ధారిణి! దీర్ఘోపవాసకృశాంగి! ఆ దివ్యనేత్రములనుండి ధారాపాతముగ వర్షించుచున్న ఆ యమృతవృష్టిఁ జూచితివా? ఆవిశీర్ణ కంఠోద్గత మగుచున్న యా ప్రేమసంగీతమును వినుచుంటివా! ఆహా! ఆహా! ఎట్టి యపూర్వదృశ్యమమ్మా!

కౌస— నాయనా! ఈ విపరీత మేమి?

[illegible] — [illegible]ము కాదమ్మా! ఆ మహా మహిమాన్విత జానకి [illegible]చుట లేదా? నా నయన గోళములను నీవుధరించి [illegible]ము! ఆ జగత్పావనిని జూడుమమ్మా! ఆహా! ఆ [illegible] స్వర్గామృతమున నామనస్తాపములెల్ల నిశ్శేషముగ [illegible]ము [illegible] తల్లీ! ధన్యోస్మి! ధన్యోస్మి!

కౌస — [illegible] తండ్రీ! తండ్రీ!

శ్రీరా — అమ్మా! [illegible] దుఃఖించెదవేమి? ఈ మహాపవిత్ర [illegible]మున నీ కన్నుల బాష్పము లేమి తల్లీ? నేనేమి యు[illegible] [illegible]నా, నీవు దుఃఖించుచుంటివి? నేనున్మత్తుండను [illegible]మ్మా! ఈయనాచ్ఛాదితవక్షమునందు ఆ దేవీమూర్తి సుప్ర[illegible] [illegible]యున్నది! ఈ వక్షమును భేదించి చూడుమమ్మా!

కౌస — (స్వగ[illegible]) ప్రభూ! జగద్రక్షకా! రక్షింపుము. రక్షింపుము.

శ్రీరా — [illegible] సృష్టిని నేనా దివ్యమూర్తిని జూచుచున్నాను. ఆ దివ్యమూర్తి నేను స్వర్ణమూర్తిగఁ జేసి ప్రాణప్రతిష్ఠ గావించె దను! సచేతన మొనర్చెదను! పిమ్మట బాష్పజలధారలచే నామెకు మంగళస్నానముఁ గావించెదను! పిమ్మటఁ బ్రేమామృత వర్షమున నామె కభిషేకముఁ జేసెదను! పిమ్మట నాస్వర్ణ మూర్తిని సర్వలక్షణ లక్షితయగు మానవమూర్తిని గావిం చెదను! అమ్మా ఆశీర్వదింపుము. ఆశీర్వదింపుము.

కౌస — తండ్రీ! నీ మనోభీష్టము సంపూర్ణ సిద్ధిఁ గాంచుఁ గాక!

(నిష్క్రమించును.)

శ్రీరా — లక్ష్మణా!

(లక్ష్మణుఁడు ప్రవేశించి యభివాదనముఁ జేయును.)

శ్రీరా — ఈ మందిర ద్వారమున నీవు కావలి యుండుము. అభ్యం తర గృహమున నేను స్వర్ణసీతా నిర్మాణముఁ గావించెదను. నాదీక్ష కెట్టి భంగమును గలుగ రాదు. లోని కెవ్వరిని రానీయ వలదు.

(మందిరద్వారము తెరచి, లోనికేగి తలుపువేసుకొనును.)

లక్ష్మ— (స్వగ) ఆహా ! ఎంతకాలమునకుఁ దిరిగి నా కిట్టి మహా భాగ్యము సంప్రాప్తమైనది ! ఆనాటి పంచవటీ నివాసము నాకు స్మరణకు వచ్చుచున్నది ! సత్యవ్రత పరిపాలనార్థము ఏనాఁడయోధ్యాపురమును విడచి యరణ్యా గాములమైతిమో, ఆ నాటి మొదలు, పదునాల్గేండ్లు నిద్రాహారములు లేక ధనుష్పాణినై, యిట్లే పర్ణకుటీర ప్రాంగణములఁ గావలియుంటిని ! ఆ సేవాభాగ్యము తిరిగి యింతకాలమునకు నాకు లభించినది ! కాని ఆ పర్ణకుటీరమునకును, ఈ రాజమందిరమునకును ఎంత తారతమ్యము కలదు !

తే: గీ॥ లలిత సీతా విలాస లీ ♦ లా ప్రభూత
స్వర్గ సామ్రాజ్య ధామ మా ♦ పర్ణశాల !
జానకీశూన్య శూన్యశ్మ ♦ శాన భూమి
యహహ ! యీ మహారాజ సౌ ♦ ధాంత రంబు !

( ప్రవేశము — భరతుఁడు )

భర— లక్ష్మణా ! అన్నగా రెచ్చట ?

లక్ష్మ— (సంజ్ఞఁజేయుచు) సోదరా ! మెల్లఁగ మాటలాడుము. నందిగ్రామము నుండి యెప్పుడు వచ్చితివి ?

భర— ఇప్పుడే వచ్చుచున్నాను. సీతా బహిష్కరణమునకు అన్నగారిపై నాగ్రహించి, పామరునివలె రాజగృహమును విడచి పోయితిని. పరితాప తప్తుఁడనై యిప్పుడా మహాప్రభుని క్షమాభిక్ష మర్థింప వచ్చినాను. ఏరీ, వా రెచ్చట ?

లక్ష్మ— మెల్లఁగ—మెల్లఁగ మాటలాడుము.

భర— ఏమి ? విశేష మేమి ?

లక్ష్మ— వా రిప్పుడీ శ్రీమందిరమున ధ్యాన సమాధి యందున్నారు. దీక్షాభంగము కాఁగలదు, జాగ్రత !

భర— ధ్యానసమాధియందా? నాకేమియు నర్థమగుట లేదు!

లక్ష్మ— త్వరలోనే అంతయుఁ దెలియఁగలదు. సోదరా! కొంచెె మోపికఁ బట్టుము.

(ప్రవేశము — లవుఁడు)

లవు— (బిగ్గఱగ) అయోధ్యాపురీశ్వరు లెచ్చట? అశ్వమేధ కర్తలగునా రఘువరేణ్యు లెచ్చట?

లక్ష్మ— మూర్ఖ బాలకా! ఎవ్వఁడవు నీవు? ఏొ మ్మావల.

లవు—నీచ సేవకా! దూర ముండుము, జాగ్రత్త.

(లక్ష్మణుఁడు లవునిఁబట్ట నుద్యుక్తుఁడగును. తటాలున మందిర ద్వారమును దెరచుకొని శ్రీరాముఁడు ప్రవేశించును.)

శ్రీరా— ఎవ్వరిదా కంఠస్వరము! ఎవ్వరిదా చిరకాల పరిచిత మైన సుధామధురస్వరము!

భర— అగ్రజా! పరితప్త హృదయుఁడగు భరతుని యభివాద మందుకొనుఁడు.

(నమస్కరించును)

లవు— తామే అయోధ్యాపతి, రావణవిజేత, రఘురాములా?

శ్రీరా— (ఉన్మత్తునివలె లవునిఁజూచుచు) నీవు ... నీవు ... నీవు ఎవ్వరవు నీవు బాలకా?

లవు— మహారాజా! నేను వాల్మీకి మహర్షి పుణ్యాశ్రమమున వాసంబున్న యొక తాపస బాలుఁడను. తమచే విడువఁబడిన యశ్వమేధ హయమును నేను బంధించి యున్నాను. ఆయశ్వము వెంటఁ బంపఁబడియున్న సమస్త సైన్యమును నాచేఁ బరాజితమై తమసాతీరమున మూర్ఛాగతమై పడియున్నది.

శ్రీరా— (లవునివైపు తేరి చూచుచు) ఆహా!

ఉ॥ ఆ ముఖచంద్ర వైభవమె! ♦ యా యపరాజిత ఫాలదేశమే!
ఆ మృదులాబ్జ గంధ మల ♦ యానిల శీతల దృక్ ప్రసారమే!
ఆ మధురామృత స్వరమె! ♦ యా యసమాన తనూవిలాసమే!
ఆ మహనీయ విగ్రహమె ♦ యారయ నియ్యది మూడుమూర్తులన్!

బాలకా!

తే॥ గీ॥ జగతి నే ధన్యజీవుల ♦ శత సహస్ర
జన్మ జన్మాంతర తపః ప్ర ♦ సాద మీవు?
తండ్రి! యే మాతృవక్షస్సు ♦ ధారసంబు
పాన మొనరించి తీవు లా ♦ వణ్య నిలయ?

లవు— ఏ మయ్యా! అచ్చటఁ దమ సేనాపతి యిల్లే యనెను. ఇచ్చటఁ దాము సహిత మదే ధోరణి!

శ్రీరా—ఏమీ! నా సేనాపతి కూడ నిట్లే యనెనా?

లవు— మీ మనఃప్రవృత్తి నా కాశ్చర్యముఁ గొల్పుచున్నది! ఏమి మహారాజా! మీ యయోధ్య యందలి ప్రజలందఱకు నిదే రోగమా? రూపగ్రహణము తప్ప చాప గ్రహణము మీకుఁ జేతఁ గాదా? నే నిందుల కేల వచ్చితినో యెఱుఁగుదురా?

తే॥ గీ॥ రావణ విజేతలైన సం ♦ గ్రామ శూరు
లనుమఁ దమతోఁడ రణము సే ♦ యంగఁ దలఁచి
వచ్చి యుంటిని కాని, తా ♦ వక ప్రియోక్తు
లాలకింప రాలేదు నే ♦ నవని పాల!

రాజేంద్రా! మీ యశ్వమును బంధించిన శత్రువును నేను!

శ్రీరా— ప్రియ బాలకా! నీవు నాకు శత్రుఁడవా?

తే॥ గీ॥ శుష్కమై, భ్రష్టమై, సర్వ ♦ శూన్యమైన
నావిశీర్ణ మనః ప్రమ ♦ దావనంబుఁ
దిరిగి యుజ్జీవిత మొనర్ప ♦ నరుగు దెంచు
శ్రీ వసంతవాయు తరంగ ♦ మీవు కావె!

ద్వాదశవర్షములు నిద్రాహారములు లేక యేమనోహర నేత్రములను నేను ధ్యానించు చుంటినో, యా దివ్యనేత్రద్వయమే యిది! ఏ సుధామధుర కంఠస్వరవాహిని నాకు సర్వతాపహరమై యుండెనో, యా కంఠస్వరమే యిది! కుమారా! నా ప్రాణసతీ దివ్యమోహన స్వరూపము నీ సర్వాంగము లందును ముద్రితమై కన్పట్టు చున్నది! నీ కోమలకంఠము నుండి యామె మధుర వాణియే వినవచ్చు చున్నది! బాలకా! ఆమె స్వరూపమును జూడుము.

( మందిర ద్వారముఁ దెఱచి సీతాస్వర్ణ విగ్రహముఁ జూపును. )

లవు— (చూచి విభ్రాంతుఁడై) ఎవరి విగ్రహ మది! ఎవ్వరి స్వరూపమది! ఆహా! నా తల్లి! స్వయముగ నా తల్లియే యిచ్చటఁ బ్రత్యక్షమైనది! అమ్మా! అమ్మా!

శ్రీరా— (మహా సంభ్రమముతో) ఏమీ! ... ఏమీ! ... ఈమె నీ తల్లియా? ... నీ తల్లియా యీమె? ... నీవు ... నీవు సీతాపుత్రుఁడవా? నాయనా! నాయనా! (కన్నీరు గార్చును.)

లవు— అగును. నేను సీతాపుత్రుఁడను! ఈమె నా తల్లి! ఈ విగ్రహముతో మీ కేమి పని?

శ్రీరా— (గద్గదికతో) సీతాపుత్రుఁడవా? సీతాపుత్రుఁడవా? తండ్రీ! తండ్రీ! ఈ భిక్షుక వేషమేమి? మహారాజ పుత్రుఁడ వైన నీకీ తాపసవేషమేమి నాయనా? రమ్ము, రమ్ము. ఈ యభాగ్యుని వక్షఃపీఠము నలంకరింపుము తండ్రీ!

(కన్నుల నీరు కాఱ, లవుని గౌఁగలించుకొనఁ బోవును)

లవు— (కౌగిలి విడిపించుకొని) వలదు. వలదు, నన్ను విడువుఁడు. నాకంతయు దెలిసినది! (మహాదుఃఖముతో) నేను భిక్షుకుఁడను. తాము నన్ను భిక్షుకునిఁ జేసి వైచితిరి! నా తల్లి గర్భవాసము నందే తాము నాచేత భిక్షాపాత్రఁ బెట్టితిరి! నేను భిక్షుకుఁడను!

మహారాజ పుత్త్రుఁడను కాను ! ఈ రాజప్రాసాదమున నాకు స్థానము లేదు. నన్ను విడువుఁడు. భిక్షుకుఁడను నేను ! అమ్మా ! అమ్మా ! (ఏడ్చుచుఁ బరుగున నిష్క్రమించును.)

శ్రీరా— భరతా ! లక్ష్మణా ! శీఘ్రముగఁబోయి బాలుని దోడ్కొని రండు.

(భరత లక్ష్మణులు నిష్క్రమింతురు)

శ్రీరా— (మహాదుఃఖముతో) ప్రభూ ! ప్రభూ ! అనుగ్రహింపుము. ఈ నిస్తేజ కళేబరమును తమసాతీరమునకుఁ దోడ్కొని పొమ్ము. సీతా బాష్పజల తరంగితమైన యా పావన తమసా తీర్థమున నన్ను ముంచివేయుము. సీతా నిశ్వాససంచలితమైన యా మహారణ్య మధ్యమున నన్నుఁ బూడ్చివేయుము. ప్రియ కుమారా ! నన్ను సహితము నీ మాతృపద సాన్నిధ్యమునకుఁ దోడ్కొని పొమ్ము. ఈ జగతియంతయు నా కింక నంధకారమయము ! నా కింక సర్వము నగమ్య గోచరము !

చ. రణధర్మంబును రాజధర్మ మను నే • రన్ విశ్వసామ్రాజ్య శా
సన ధిక్కార మొనర్చియున్న కలుష • స్వాంతుండ ! లోకైక పా
వని నుగ్రాటవి పా లొనర్చిన మహా • పాపంబు, నిర్దోషియౌ
మునిఁ గూలించిన ఘోర పాతకము, నన్ • బూర్ణాహుతిన్ జేయవే ?

ఈ ధర్మద్రోహికి, ఈ యాత్మద్రోహికిఁ బ్రపంచమున స్థానము లేదు! సర్వేశ్వరా ! ఈ మహాపాతకుని మూర్ధమునఁ బదక్షేప మొనరించి పాతాళమునకుఁ ద్రొక్కి వేయుము. అమంగళమగు రామశబ్దము బ్రహ్మాండమునం దెచ్చటను వినఁబడరాదు !

సీ. రామరాజ్యము పాప • రాజ్యమంచు నఖండ
భూమండలంబు మా • ర్మ్రోగుఁగాక !
రామనామంబు రౌ • రవ ఘోర నరక మా
ర్గమటంచు జగతిఁ జే • ర్వడును గాక !

రామశబ్ద మధర్మ । నామాంతరం బౌచు
శబ్ద గోళమునఁ దే । జరిలుఁగాక !
రామవర్ణన ముగ్ర । ధూమకేతు వటుంబుఁ
బంచభూతములు ఘనా । పింపఁగాక !

గీ॥ 'రామ' యనియెడు పాపాక్షు । రములు రెండు
సాధుసజ్జన శ్రవణ భీ । షణములనుచు
ఆత్మ విద్రోహ్య శోక్య ల । జ్ఞాంధకార
ములకుఁ జిహ్నంబులై ధాత్రి । వెలయుఁగాక !

( ప్రవేశము — భరత లక్ష్మణులు )

శ్రీరా—(సంభ్రమముతో) ఏఁడీ ? కుమారుఁ డేడీ ? తోడ్కొని రాలేదా ?

భర— ప్రభూ ! అశ్వారోహియై యా బాలకుఁ డప్పుడే వాయు వేగమున సరయూసైకతముల నతిక్రమించినాడు! సరయూనదీ ప్రాంతమంతయు నా బాలుని మాతృస్మరణాక్రోశముచేఁ బ్రతి ధ్వనించుచున్నది ! ఆతనిసమీపించుటయే మా కసాధ్యమైనది !

శ్రీరా — అభాజనులారా ! "శ్రీరాముడు పాదాక్రాంతుఁడై ప్రార్థించుచున్నాఁడు, రమ్ము తండ్రీ !-రమ్ము" అని యెలుగెత్తి దీనాలాపములఁ బిలువఁజాలకపోయితిరా ?

లక్ష్మ— అత్యంత దీనాలాపముల నాహ్వానించితిమి. కతిపయ దూరమునందు నిలచి, యశ్వోపరిభాగమునుండి తిరిగిచూచి, మాతో నాతఁ డిట్లనెను.

శ్రీరా—(ఆత్రముతో) ఏమనెను ? ఏమనెను ?

లక్ష్మ— "మీ యజ్ఞాశ్వమును మీకిచ్చి వైచెదను. మీతో నేను రణము సేయనొల్లను. మాతాభ్రాతృసహితుండనై భిక్షాపాత్రను జేతబట్టి రామనామ సంకీర్తన మొనర్చుకొనుచు దేశదేశముల

దిగ్భ్రమ్మరెదను. ఏ పాపరాజ్యమునుండి నా తల్లి మిథ్యాపవాద హేతుకముగ నిష్కారణముగ బహిష్కరింపఁబడెనో యా యయోధ్యారాజ్యభూమిపై నే నింక నడుగుపెట్టను. పోండు. పోండు." అనిబిగ్గఱగఁ గేకలిడి, క్షణమాత్రమునఁ బురోమార్గ యానమున నదృశ్యుఁడయ్యెను.

శ్రీరా—(మహాదుఃఖమున) హా! హా! అభిశాపహతుఁడను! అభిశాప హతుఁడను! భగవన్! భగవన్!

( మూర్ఛితుఁడగును. భరత లక్ష్మణులు సేవా ప్రమత్తులగుదురు. )

( తెరలో — వాల్మీకి సంకీర్తనము )

గీతార్థము.

[ సత్యము, ధర్మము, వీని నిజస్వరూపమును హృదయవీణాతంత్రులు దివ్యసంగీత మొనర్చుచు నిరూపింపవలెను. బహిరింద్రియములకు సత్యముగఁ దోచునదెల్ల సత్యము కాదు. ధర్మముగఁ దోచునదెల్ల ధర్మము కాదు. హృదయ సింహాసనస్థుఁడైయున్న సర్వాంతర్యామి ఆత్మసాక్షి సత్యధర్మముల నిజస్వరూపమును నిరూపించును. ]

శ్రీరా—(చైతన్యముఁగాంచుచు)- ఆహా! ఆహా! ఆ దివ్యవాణి యేమనుచున్నది? ఆ గంభీర కంఠధ్వని యెవ్వరిది? ధర్మతత్త్వము నుద్ఘోషించుచున్న యా యమృతాలాపము లెవ్వరివై యుండును?

వాల్మీ— (పాడుకొనుచుఁ బ్రవేశించి, పాట పూర్తిఁజేయును.)

శ్రీరా— (లేచి సమీపించి) మహాపురుషా! శ్రీరాముని యభివాదమందుకొనుఁడు. పాపపంకిలమైన యీ రాజమందిరమును బవిత్రీభూత మొనర్చిన తా మెవ్వరు?

వాల్మీ—నేను వాల్మీకి యను తాపసిని. శ్రీ రామాయణ కావ్యకర్తను! ఈ వాస్తవిక ప్రపంచమునకు బహుదూరమున, ఊహానిర్మితమైయున్న కావ్యజగతియందు, కల్పనా రాజ్యమున

నా నివాసము ! అందే నేను నిన్ను సృజించితిని ! రఘురామా! నీవు నాకుఁ బుత్త్రి తుల్యుఁడవు !

శ్రీరా—ధన్యోస్మి ! ధన్యోస్మి ! (నమస్కరించును.)

భరత
లక్ష్మణు } — (నమస్కరింతురు.)

వాల్మీ— (అందఱను ఆశీర్వదించును.)

శ్రీరా— మునీంద్రా ! తమ దివ్య దర్శనమున నేను కృతార్థుఁడ నైతిని. మహాత్మా ! రామాయణ కావ్యకర్తలగు తమకు నా బహిరంతర సర్వస్వమును దెలియును కదా !

వాల్మీ— తెలియును, వత్సా ! అంతయును నాకుఁ దెలియును. ఈ ద్వాదశవర్షములును సీతా విరహావ్యథాభారమున సాగిన నీ జీవన క్రమమంతయు నాకుఁ దెలియును. రామచంద్రా ! దుఃఖింపకుము. నీ ధర్మపత్ని జానకిదేవి పుత్త్రద్వయా సమేతముగ నా యాశ్రమమునందుఁ గుశలముగ నున్నది ! సందేహింపవలదు. వంశవర్ధనులగు నీ వీరపుత్త్రుల పరిచయభాగ్యము నీకుఁ ద్వరలోనే లభింపఁ గలదు.

> తే. గీ. భాగ్యరాశి, రామా! కళ సంభవుఁడు-కుశుఁడు,
> వసుమతీశ్వర ! నీ జ్యేష్ఠ బాలకుండు !
> యామమాత్ర విలంబాను గామి-లవుఁడు,
> అఖిల శుభలక్షణుండు, నీ తాంశభవుఁడు !

శ్రీరా— ధన్యోస్మి ! ధన్యోస్మి ! ఋషిపుంగవా ! నా సవనాశ్వమును బంధించి, రక్షక సైన్యమును బరాజితమొనర్చి, పితృపరిచయార్థము అయోధ్యకువచ్చిన నావీరపుత్త్రునొకనిఁ గాంచి మహానంద మందితిని. కాని, నా యానందము క్షణమాత్ర పరిమితమై నశించినది. అభిమానభరమున శోకాకులుఁడై యా బాలుఁడు నా ముఖముఁ జూడనొల్లక వెడలిపోయెను.

వాల్మీ— అగును. ఆశ్రమాభిముఖుఁడై వాయువేగమున మఱలి పోవుచున్న యా లవకుమారుని నేను సరయూతీరమునందుఁ జూచితిని. బాలుఁడు తీవ్ర శోకముచే వగర్చుచుండెను.

శ్రీరా— తాపసోత్తమా ! నాకు సత్యపథమును జూపుఁడు. తుచ్ఛ రాజధర్మము సముద్ర గర్భమునఁ గూలిపోవుఁగాక ! మానవహృదయధర్మమునకు వ్యతిరిక్తమైన రాజధర్మము రసాతలగతమై నశించుగాక ! ఈ హృదయాంతరాళము నదలించుచున్న భయంకర హాహాకార విజృంభణమును నే నింక సహింపఁజాలను–సహింపజాలను. ఈ తుచ్ఛ రాజ్యపదవి నాకు వలదు. మునీంద్రా ! తమ పవిత్ర పదసాన్నిధ్యమున నీ సమస్తమును బరిత్యజించి సీతాశరణ్యమైన మహారణ్యమును జొచ్చెదను. అనుగ్రహింపుఁడు.

(మోకరించును.)

(ప్రవేశము — వశిష్ఠుఁడు)

వాల్మీ— వశిష్ఠమునీంద్రా ! నమస్కారము.

వశి— ఓహో, వాల్మీకి మహర్షి ! (కౌఁగలించుకొని) మునీంద్రా! మీ పాదస్పర్శచే యజ్ఞవాటిక పవిత్రము కాఁగలదు. రామచంద్రా ! యజ్ఞక్షేత్రమునందుఁ దపోధను లనేకులు వచ్చి నిరీక్షించుచున్నారు. నానా దేశాగతులైన రాజపుంగవులు వేచుకొని యున్నారు. యావద్భారత వర్షము వేయికన్నులతో ప్రతీక్షించుచున్నది. సత్వరము యజ్ఞవాటికకు రమ్ము.

శ్రీరా— గురుదేవా ! యజ్ఞసన్నాహమంతయు నిల్పివేయుఁడు. సమాగతమైన సమస్త ప్రజానివహమునకును నా క్షమాభిక్షను దెల్పుఁడు. అచిరకాలమునందే యశేష రాజ మండలమును, తపోధనగణమును ఆహ్వానించి, వారి సమక్షమున నీ

యయోధ్యా సింహాపీఠిపై భరతు నభిషిక్తునిఁజేసి నేను వాన
ప్రస్థమును స్వీకరించి యరణ్యగామి నయ్యెదను.

భర— (చకితుఁడగును)

వశి— రామచంద్రా! నీ యభిప్రాయము నాకుఁ దెలియుట లేదు.

శ్రీరా— గురూత్తమా! రాజధర్మ నిర్వహణము నాకింక నసాధ్యము! హృదయ ధర్మమును దప్ప అన్యధర్మమును నేనింక స్వీకరింపఁజాలను. స్వతంత్ర విచారణాధికారము లేని రాజత్వము, కేవలము శాస్త్రనియుక్తశాసనాధీనమైన తుచ్ఛయంత్ర భ్రమణమును నేను విసర్జించు చున్నాను. మునీంద్రా!

తే॥ గీ॥ నా నిమిత్తము నా బహిః ♦ ప్రాణమైన
జానకీదేవి సర్వంబు ♦ సన్యసించె!
ఆమెకై తుచ్ఛ రాజ్య సిం ♦ హాసనంబు
వదలకుంటిని జీవచ్ఛ ♦ వంబ నేను!

నా జ్ఞాన దృష్టి నింతకాలమును గప్పివైచిన మాయాధూమ పటల మిప్పుడు విచ్ఛిన్నమైనది. ఇంక నొక్కక్షణమైన నే నీరాజ్య పదవి నుండఁజాలను.

వశి— యజ్ఞానుష్ఠానమునకై నీవే స్వయముగ స్వర్ణసీతా నిర్మాణముఁ గావించితివి! తిరిగి యిప్పుడీ పరివర్తన మేమి?

శ్రీరా— స్వర్ణ సీత! స్వర్ణ విగ్రహము! ఆ నిర్జీవ ప్రతిమను గొనిపోయి సరయూతరంగ మధ్యమునఁ బాఱవేయుదు. భరతుని రాజ్యాభిషిక్తునిఁ జేసి నేను వానప్రస్థుఁడ నయ్యెదను.

భర— (చెవులు మూసికొని) పాపము శమించుఁగాక! శ్రీరామ పరిత్యక్తమైన సింహాసనముపై భరతుఁ డభిషిక్తుఁ డగుటకుఁ బూర్వము జగత్ప్రళయము సంభవించుఁగాక!

వశి— శ్రీరామ పరిత్యక్తమైన సింహాసనముపై నధివసించుట కెవ్వరి కర్హత కలదు? వత్సా! నీవు వానప్రస్థము స్వీకరించిన రాజ్యమున సర్వతోముఖ విప్లవము సంభవించును.

శ్రీరా— సంభవింప నిండు. రాజ్యము విప్లవాగ్నిలోఁబడి భస్మము కానిండు. ఇట్టి సహస్రకోటి సామ్రాజ్యములకన్న సీతా ప్రేమామృత బిందు వొక్కటి నాకు వాంఛనీయము! ఆ ప్రేమ స్మరణ మొనర్చుకొనుచు నే నరణ్య వీధుల సంచరించెదను.

వశి— (వాల్మీకితో) మునిచంద్రమా! ఇంకఁ గర్తవ్యమేమి? మీకు గోచరము కాని విషయము బ్రహ్మాండమున లేదు. ఈ సమయమున మీరు తోడ్పడకున్న సూర్యవంశము విధ్వస్తము కాఁగలదు.

వాల్మీ— ఋషీంద్రా! నా యంతర్నేత్రమునకుఁ గేవల మొక్కటి మాత్రమే సాధనము గోచర మగుచున్నది! అది జానకీ పునరాగమనము.

వశి— అది యెట్లు సాధ్యము కాఁగలదు? అపవాదఘాతయై, యవమానితయై యీ రాజ్యలక్ష్మి రాజ్యత్యాగ మొనర్చినది. ఆమె తిరిగి అయోధ్యకు వచ్చునా? మహాత్మా! ఈ మహా సమస్యా పరిష్కారము కూడ మీ వల్లనే కావలయును.

వాల్మీ— (యోచించి) అయోధ్య యందలి ప్రజాసర్వస్వము, ఆబాల వనితా వృద్ధముగ, ప్రజానాయకుల వెంటఁబోయి, ఆ మహాసతీచరణ సాన్నిధ్యమున క్షమాభిక్ష మర్థించినచో సామ్రాజ్యమాంగళ్యము నిమిత్తము నా యాశ్రమ లక్ష్మి తిరిగి మీ రాజ్యలక్ష్మి కాఁగలదు. సందేహము వలదు. ఆ భారము నాయది.

వశి— మహానందము, మునీంద్రా! మీ యాదేశము నయోధ్యా ప్రజాకోటి తప్పక పాలించును.

భర— మునీంద్రుల యాదేశ మవశ్యము పాలింపఁబడును. స్వయముగ నేను వాడవాడకును బోయి ఋషివాక్యము నుద్ఘోషించెదను.

తే॥ గీ॥ మన మహారాజ్య లక్ష్మి శ్రీ । స్మృతి సమోఘ్య
కైన రావతె జయ జయ । ధ్వానములను !
దగ్ధ పటలమై యీ యశో । ధ్యాపురంబు
కాలి పోనైన వలయుఁ బా । తాళమునకు !

( ప్రవేశము — భద్రుఁడు )

భద్రు— మహారాజా ! మునీంద్రులారా ! భరత లక్ష్మణ దేవులారా ! తమ దివ్యసముఖమున పరమాద్భుతమగు నొక నివేదనమును జేయవచ్చితిని.

వశి
భర } ఏమది?
లక్ష్మ

భద్రు—ప్రజానాయకులెల్ల సింహద్వారము కడ సమావేశమై యున్నారు. జానకీదేవి స్వర్ణమూర్తిని దర్శించి యా మహాసతి శ్రీచరణ సాన్నిధ్యమున క్షమాదానమర్థింప వేగిర పడుచున్నారు.

భర— (మహానందమున) భద్రా ! ఇది సత్యమే యగునా ?

భద్రు— మహాప్రభూ ! సత్యము. మిన్నుముట్టుచున్న యా ప్రజా ఘోషము నాలింపుఁడు. మిథ్యాపవాదమును సహస్రముఖముల ఖండించుచున్నారు. సీతాశూన్యమైన శ్రీరామ రాజ్యము అసంపూర్ణమని ఘోషించుచున్నారు.

భర— గురుదేవా ! మహర్షిపుంగవా ! ఇంత కాలమునకుఁ బ్రజాహృదయమున జ్ఞానోదయమైనది ! ఇంక మనమందఱము యజ్ఞవాటికకుఁబోవుదము రండు. వాల్మీకి మహర్షి పాద స్పర్శ మొనర్పించి ప్రజానాయకులచే నపరాధ స్వీకరణ మొనర్పించి ప్రజాగణమును క్షమాయోగ్య మొనర్తము, రండు. లక్ష్మణా ! పుణ్యభూమియైన వాల్మీకాశ్రమమునకుఁ

బోవ రథము సిద్ధముఁజేయుము. దేవిని తొల్లి యరణ్యమున విడచి వచ్చినది నీవు! తిరిగి యామెను నీవే యరణ్యమునుండి యయోధ్యకుఁ దోడ్కొని రావలయును.

( వశిష్ఠ వాల్మీకులు, భరత లక్ష్మణులు నిష్క్రమింతురు. )

రా— భద్రా! ద్వాదశవర్ష పరిమితమైన యీ గాఢరాత్రి యింత కాలమున కంతము కానున్నదా? ఈ కాలరాత్రి కారంభము తొల్లి నీముఖముననే కదా! తిరిగి దాని యంతము సహితము నీముఖముననే వినవచ్చినది! భగవాన్! ప్రభాత రేఖా దర్శనమునకై యింక నెంతకాలము నేను వేచి యుండవలెను! (తెరవ్రాలును.)



ఓం

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

శ్రీ

# పృథ్వీపుత్రి

## పంచమాంకము

### దృశ్యము 1.

[తమసా తీరము—భూగర్భమునుండి కరుణారస మయమగు సంగీతము విన వచ్చుచుండును. సీత యొక తిన్నెపైఁ గూర్చుండి తదేకధ్యానయై యా సంగీతమును వినుచుండును. ఆశ్రమ వాసినియైన ఆత్రేయి సీతముఖమును జూచుచుఁ గూర్చుండి యుండును.]

సీత— ఆహా! సర్వచింతాపహారమైన యీ సుధా మధుర సంగీతము నాలించుచుంటివా, ఆత్రేయీ?

ఆత్రే— అమ్మా! ఆలించుచున్నాను. ఆ మధురనాదము నిర్జనమై యున్న యీ యేకాంత ప్రదేశమునం దెచ్చటి నుండి వచ్చుచున్నది?

సీత— ప్రకృతి స్వరూపిణి, ధరిత్రి, నా ప్రియజనని హృదయాంతరాళమునుండి యీ కరుణామయ సంగీతవాహిని యావిర్భూతమగుచున్నది! సంసార మాయాబధిరులగు నిర్భాగ్యులా మహాసంగీతమును వినఁజాలరు. ఈ నా మాతృదేవత యాహ్వానము దివారాత్రములు నా కర్ణములఁబడుచునే యుండును. ఆమె నన్నుఁ బిలచుచున్నది! సంసారశృంఖలముల భేదిం

చుకొని నన్నుఁ దన వక్షఃపీఠమునకు రమ్మనుచున్నది. ఆత్రే
యీ! ఈ శుష్కప్రపంచమును విడచి, తిరిగి యామెకడకుఁ
బోవ నాకును మనసగుచున్నది!

ఆత్రేయి— అమ్మా! అట్లనవలదు.

సీత— తొల్లి యరణ్యావాసమునఁ బంచవటియందు శ్రీరామసమే
తనై సర్వసౌఖ్య సంపూర్ణనై జీవనయాత్రఁ గడపుచుండిన దిన
ములయందు, గోదావరీ తరంగఘోషమునందు లీనమై యీ
మాతృసంగీతము ప్రథమమున నాకు వినవచ్చినది. కాని,
ఆ ధ్వని యప్పుడు కేవలమస్పష్టమైయుండెను. పిమ్మట, లంకా
ప్రవాసమున, అశోకవనమందు, సముద్రకల్లోల ఘోషమున
సమ్మిళితమై యీ మాతృసంగీతము తిరిగి వినవచ్చినది! ఈసారి
యది పూర్వమువలెఁ గాక, ఇంచుక స్ఫుటముగనుండెను. పిమ్మట
అయోధ్యా సింహాసనాంతరాళమునుండి తిరిగి యీ సంగీతమే
నాకు వినవచ్చినది! అది మఱింత విస్పష్టముగ నుండెను.
ఇప్పుడు, సర్వసౌఖ్యవిదూరనై, సర్వసన్యాసినినై యున్న నాకుఁ
దిరిగి యీ సంగీతమే వినవచ్చుచున్నది! ఆత్రేయీ! ఇప్పుడది
యత్యంత విస్పష్టముగ నున్నది! ఇందలి యర్థము నాకిప్పుడు
సంపూర్ణముగ గ్రాహ్యమగుచున్నది.

( తిరిగి నేపథ్యమున సంగీత ధ్వని )

సీత—అదిగో, అదిగో, ఆలింపుము, ఆత్రేయీ! ఆ యమృత
లహరి నీ కర్ణములఁ బడుచున్నదా? నాతల్లి నన్ను ఆహ్వానించు
చున్నది—ఆత్రేయీ! ఆత్రేయీ! ఇటు చూడుము; ఇటు
చూడుము. ఈ సైకతస్థలమందలి పాదచిహ్నములఁ జూడుము.

తే॥ గీ॥ కలుష భంజనియైన నా ♦ కన్నతల్లి
శ్రీ చరణ పద్మరేఖలే ♦ చెలియ, యివ్వి!

ప్రేమ హృదయము కంపంబు భ ◆ రింపలేక
నేఁడెంచె నన్నొకసారి ◆ కౌఁగలింప !

అమ్మా ! అమ్మా ! రమ్మా. నీ బాహాబంధమున నన్నుఁ జేర్చుకొనుము. (కన్నీరు గార్చును.)

ఆత్రేయి—అమ్మా ! ఊరడిల్లుము, ఊరడిల్లుము. నీ నేత్రములు చెమ్మగిల్లినచోఁ గుమారులు నిస్తేజు లగుదురు.

సీత— ఆత్రేయీ ! ఆ విషయము నే నెఱుఁగుదును. కావున నే నేటివఱకును నే నీ శుష్క కంకాళమునందు జీవములను ధరించి యుంటిని.

(మహాదుఃఖమున వగచుచు లవుఁడు ప్రవేశించి తల్లి వక్షమున శిరముంచి కౌఁగలించుకొనును.)

లవు— (ఏడ్చుచు) అమ్మా !...అమ్మా ! ... అభాగినీ !
(మాటరాక ఏడ్చును.)

సీత— (ఆత్రముతో) నాయనా ! నాయనా ! ఏమైనది ? ఏల యేడ్చుచుంటివి తండ్రీ ! నీ కేమి వాటిల్లినది ?

లవు— (ఏడ్చుచు) లక్షసార్లు నేను ప్రశ్నించినను నాకుఁ జెప్పవైతివి. నా యెడ నీ కింత యవిశ్వాస మేలనమ్మా ? (ఏడ్చుచుండును.)

సీత—ఏమైనది నాయనా ? ఏమైనది ?

లవు— (ఏడ్చుచు గద్గదికతో) హా! హా! నిరపరాధిని ! శుష్కాపవాద తిరస్కృత ! రాజ్య బహిష్కృత ! నిర్వాసిత ! సన్యాసినియౌ నా తల్లి !! ( ఏడ్చును. )

సీత— (కన్నుల నీరునించి) కుమారా ! దుఃఖింపకుము. దుఃఖింపకుము తండ్రీ ! నా గర్భమునఁ జిచ్చు రగుల్పకుము, తండ్రీ !

లవు— (ఏడ్చుచు) ఎంత యభాగినివమ్మా ! ఎన్ని కష్టముల భరించితి వమ్మా !

సీ॥ భర్తృసేవాదీక్షఁ ♦ బదునాల్గు వర్షముల్
కానపాలయితమ్మ ♦ కన్నతల్లి !
అడవులయందు ని ♦ ద్రాహారములు లేక
జీర్ణించితమ్మ, రా ♦ జీవనయన !
అవిరామ శీత వ ♦ ర్షాతప వ్యథలకున్
తలయొగ్గితమ్మ, కాం ♦ తావతల్లి !
దశకంఠ భుజంగ సం ♦ దష్టవై వివశవై
మూర్ఛ నొందితివమ్మ ♦ పుణ్యచరిత !
ఆ॥ వె॥ రాక్షసేంద్రు వీటు, ♦ రాకాసి మూకల
నడుమ, నొంటి బ్రతుకుఁ ♦ గడపితమ్మ
సంశయాపవాద ♦ సమ్మార్జనమునకై
చిచ్చునందు నీవు ♦ చొచ్చితమ్మ !!

(వెక్కి వెక్కి యేడ్చుచు) అదిచాలక ... మిథ్యాపవాదమునకుఁ దలయొగ్గి, రాజ్యబహిష్కృతవై, తిరిగి యరణ్యగామినివై, యిప్పుడు సన్యాసినివై యుంటివా, తల్లీ ! (ఏడ్చును.)

సీత— తండ్రీ ! ఊరడిల్లుము. నే నిప్పు డెట్టిదుఃఖము ననుభవించుటలేదు. మీ జన్మముచే నా సమస్తక్లేశములను, నేను సంపూర్ణముగ మఱచి పోయితిని. పూర్ణానందమయమై యున్న నా హృదయమున కిప్పుడా పూర్వ సంఘటనములెల్ల స్వప్నప్రాయములైనవి ! నాయనా ! విధి విధానము నెవ్వ రతిక్రమింపఁగలరు ?

(కుమారుని బుజ్జగించును.)

(ప్రవేశము — వాల్మీకి)

వాల్మీ— కుమారీ !

సీత— తండ్రీ ! ఇదేమి, ఇంత శీఘ్రముగఁ దిరిగి వచ్చితివి ? అశ్వమేధము సంపూర్ణమైనదా ?

వాల్మీ— (మందహాసముఁ జేయుచు) అమ్మా ! సంపూర్ణ మెట్లు కాఁగలదు ?

ఆ॥ వె॥ అశ్వ మిచటనుండె, ♦ నశ్వరక్షకసైన్య
మవల చావు బ్రతుకు ♦ లందునుండె,
సీత యిచటనుండ, ♦ శ్రీరాముఁడటనుండ,
నశ్వమేధ మెట్టు ♦ లగును తల్లి ?

అమ్మా ! నా అయోధ్యాయాత్రకు ఫలితముగ నీ విప్పు డయోధ్యకుఁ బోవలసి యున్నది.

లవు— (తీవ్రముగ) అసంభవము... అసంభవము. అది యెన్నఁటికిని కానేరదు.

వాల్మీ— నాయనా !

లవు— అయోధ్యా నగరమునకా ? ఏ పాపధామమునందలి ప్రజాగణము నా తల్లి నవమానపఱచెనో, ఆ యధీశ్వర ప్రభూమిపై నా తల్లి పదక్షేపముఁ గావింపదు. ధనాధికార గర్వాంధమై, పతివ్రతా గౌరవమును పదఘట్టిత మొనర్చియున్న యా పాపరాజ్యమునందు నా తల్లి తిరిగి యడుగు పెట్టుట కల్ల, కల్ల.

వాల్మీ— నాయనా ! రాజధర్మము పాలింపఁబడవలయునుగదా! సంఘ నియమంబులు అనతిక్రమణీయములు. శ్రీరాముని దేమి దోషము ? ఆతఁడు కేవలము రాజధర్మమును పాలించెను. ఆ ధర్మ పరిపాలనమునందు ఆ మహాపురుషుఁడు కావించిన యాత్మత్యాగము ప్రపంచాతీతము, నాయనా ! అయోధ్యా ప్రజాకోటి యిప్పుడు పశ్చాత్తప్త మగుచున్నది ! నా పదములంటి నీ తల్లిని క్షమాభిక్ష మర్థించుచున్నది ! యావద్భారత వర్షము సాక్షిగ శ్రీరాముఁడు జానకీదేవిని తిరిగిపరిగ్రహించును.

లవు— తాతా !

తే॥ గీ॥ సకల లౌకిక ధూళి ధూ ♦ సరితమైన
ఆ మహారాజ శుద్ధాంత ♦ సీమకన్న
భువన పావనమైన యీ ♦ పుణ్యభూమి
తాపసోత్తమ ! యుత్తమో ♦ త్తమము కాదె ?

వాల్మీ— సత్యమే నాయనా ! కాని, శ్రీరాముని యంతరంగమును బరీక్షించి, ప్రజాకోటి పశ్చాత్తాపమును స్వీకరించి, నేను సీతను దిరిగి యయోధ్యకుఁ దెచ్చి యప్పగించెద నని యజ్ఞవాటిక యందు సమాగతమైయుండిన రాజఋషి బృందము సమక్షమున వాగ్దాన మొనర్చితిని. నా యాశ్రమ లక్ష్మి, నా యాశ్రమ దీప్తి, సీత, యీ ప్రదేశమును విడిచినంతనే యీ తపోవన మంధకార బంధురమైపోవునని నాకుఁ దెలియును. కాని, గత్యంతరము లేదు. నా మానసిక వ్యథను బరమాత్ముఁ డెఱుఁగును.

సీత—కాని, తండ్రీ ! అయోధ్యయందలి ప్రజాగణములు—

వాల్మీ— అమ్మా ! రాజ్యమందలి ప్రజానాయకులెల్లవచ్చి యాశ్రమోపాంతమున నీ శ్రీ చరణ దర్శనమునకై వేచుకొని యున్నారు. అపరాధ స్వీకరణ మొనర్చి, క్షమాభిక్ష మర్థించి, నిన్నయోధ్యకుఁ దోడ్కొనిపోవ సంకల్పించుకొనియున్నారు. వారితో లక్ష్మణుఁడుకూడ వచ్చియున్నాఁడు.

( తొందరగా లవుని వెంటనుండిన బాలకుఁడు ప్రవేశించును. )

బాల— లవకుమారా ! లవకుమారా ! కోపమునిఁగినది, నీచేఁ బడఁగొట్టబడిన సైన్యమంతయుఁ జెదపుట్టవలె గోల గోలమని లేచి నిలువబడినది! ఏమిదండు! ఏమి దండు ! ఏమి కోలాహలము ! తమసాతీరమంతయు మహా అల్లకల్లోలముగా నున్నది !

లవు— (సీతతో) నాచేఁ బ్రయోగింపఁబడిన సమ్మోహనాస్త్ర ప్రభావముచే ఆ సైన్యమంతయు మూర్ఛాగతమైన దమ్మా ! మూఁడు రాత్రులు గడచిపోవుటచేఁ, దిరిగి యా సైన్యమంతయు సచేతనమైయుండును.

బాల—ఇంతలో, ఆ వైపునుండి మఱొక పెద్దదండువచ్చి, వారితోఁగలసినది ! నాకుఁ జాలభయముకలిగి, పరుగెత్తుకొనివచ్చి మన పెద్దమఱ్ఱిమాటున డాగియుండి, వారిచర్యలను గనిపెట్టితిని.

ఆ క్రొత్త దండుతో మఱొక సేనాపతివచ్చి ప్రాత సేనాపతిని గలసికొని యేమేమో కొంతసేపు మాటాడినాడు.

వాల్మీ— ప్రజాగణ సమేతుఁడైన లక్ష్మణుఁడు యాగాశ్వమున కంగరక్షకుఁడై వచ్చియుండిన శత్రుఘ్నునిఁ గలసియుండును.

బాల— ఇప్పుడు వారిద్దఱును ఆ సైన్యమునంతయు వెంటబెట్టుకొని, యీ వైపే వడివడిగా వచ్చుచున్నారు. ఒక్కఁడే పరుగున నే నాశ్రమములోనికి వచ్చిపడితిని. సైన్యమంతయు వచ్చి ద్వారముకడ నాగినది. మన కుశకుమారుఁడు ఆ సేనాపతుల నిద్దఱ నెదుర్కొని, వారితో నేమేమో కొంత మాటాడి, వారితోఁ గలసి, అదే, యిటు వచ్చుచున్నాఁడు.

(ప్రవేశము — లక్ష్మణ శత్రుఘ్నులతో కుశుఁడు)

కుశు— అమ్మా! ఎవ్వరినిబట్టి మన ద్వారముకడకు దెచ్చితినో చూచితివా?

తే॥ గీ॥ కడఁగి లంకామహోగ్ర సం ♦ గ్రామ మందు
మేఘనాథునిఁ గూల్చిన ♦ మేటి యితఁడు!
ఈ మహావీరు ముడుఁబట్టి ♦ యీడ్చి యిటకుఁ
దెచ్చియున్నట్టి నేనెట్టి ♦ దిట్టనమ్మ!

(అందఱును నవ్వుదురు)

కుశు—(శత్రుఘ్నునిఁ జూపుచు) అమ్మా! ఈతఁడెవ్వరో నీకుఁ దెలియునా?

తే॥ గీ॥ సార్థకాహ్వయుఁ డుగ్ర ప ♦ రాక్రముండు,
యజ్ఞహయ రాజమున కీతఁ ♦ డంగరక్షు!
ఇతని మూర్ఛాగతు నొనర్చి ♦ యీ లవుండు
చేయఁగారాని దోషంబుఁ ♦ జేసెనమ్మ!

లవు— (లక్ష్మణ శత్రుఘ్నులకు నమస్కరించుచు) తండ్రులారా! అపరాధియైన యీ లవకుమారుని క్షమింపుఁడు.

లక్ష్మ— } — (లవకుశులను గౌఁగలించుకొందురు.)
శత్రు— }

సీత— సుమిత్రా సుతులారా! ఎంతకాలమునకుఁ దిరిగి మిమ్ముఁ జూచు భాగ్యము సంప్రాప్తమైనది!

లక్ష్మ— దేవీ!

చం॥ వడివడి రాజమార్గముల • పై రథవేగక శక్తిఁ జూపి, ని
స్నదవుల డించి క్రమ్మఱిన • యా నరరూపపిశాచి యీతఁడి
య్యెడ కరుడెంచెడిన్ బిడియ • మింతయు లేక సతీమతల్లి! నిన్
గడుప నయోధ్యకున్ మఱల, • కర్మఫలానుభవంబు తప్పునే!

దేవీ! అయోధ్యయందలి యావత్ ప్రజానివహమును నా ముఖంబునఁ దమ మహాపరాధమునకు నిన్ను క్షమాభిక్ష మర్థించుచున్నది. ప్రజానాయకు లెల్లరును నా వెనువెంట నేతెంచి, నీ శ్రీచరణ దర్శనమునకై యాశ్రమ ద్వారముకడ వేచుకొని యున్నారు. తల్లీ! వారి ప్రార్థన మంగీకరించి, తిరిగి రాజధానికి విజయముచేసి సామ్రాజ్యము నుద్ధరింపవా?

సీత— సౌమిత్రీ! ముందు కుశలవార్త లెఱిఁగింపుము. అయోధ్యాపతికి క్షేమమే కదా? అయోధ్యా ప్రజాకోటికి మంగళమా?

లక్ష్మ— తల్లీ!

తే. గీ. చంద్ర కళలేని జలధరా । చ్ఛన్నరాత్రి,
దీపశిఖలేని రాజమం । దిరము కాదె,
జానకీదేవి లేని రా । జ్యంబు! దేవి!
క్షేమ మెటుకల్గు నా రుద్ర । భూమియందు?

వాల్మీ— అమ్మా! విలంబమేల? ఇంకపై క్షణమొక మహాయుగము కాఁగలదు. బాలకులారా! ప్రయాణ సన్నద్ధులు కండు.

సీత— తండ్రీ! ఇది రాఘవులకు సమ్మతమా?

వాల్మీ—
లక్ష్మ— } తల్లీ ! సందేహమేమి ?

సీత—ఆ మహాప్రభుని సమ్మతము నా కవశ్యాచరణీయము ! ఇంక నే నిచ్చట నుండఁదగదు. కుమారులారా ! నడువుఁడు. లవకుమారా ! జనకులపట్ల స్వాభిమానమును విడువుము తండ్రీ ! శ్రీరామాజ్ఞ మన కనుల్లంఘనీయము ! నడువుఁడు. మనకు సన్నాహమున కేమున్నది ?

తే. గీ. ఒక్క ప్రాణిగ నిటు వచ్చి • యున్న నేను
మూఁడు ప్రాణులమై నేఁడు • పోదు నటకు!
ఆశ్రమ వనీ విహార వి • హంగములము,
ఇతర సన్నాహములు మన • కేమి కల్గు ?

సౌమిత్రీ! శత్రుఘ్నా! నడువుఁడు. ప్రజానాయకుల దర్శించి పోవుదము.

(వాల్మీకి తప్ప తక్కినవారందఱు నిష్క్రమింతురు.)

(నేపథ్యమున గీతము)

కుమారీ ! కుమారీ ! తిరిగి సంసార మాయాగోళమునం దేలఁ బ్రవేశించుచుంటివి ? మాయ ! మాయ ! అంతయును మాయ !

వాల్మీ—(ఆలించి) భూతధాత్రి, ధరిత్రీదేవి కుమారిక నుద్దేశించి ఘోషించుచున్నది ! హే ! సర్వంసహా ! వసుంధరా ! ఈశ్వర సంకల్ప మమోఘము !

(శ్రీరామ కీర్తన మొనర్చుచు నిష్క్రమించును.)

---

## దృశ్యము 2

(అయోధ్యా రాజసభ — శ్రీరాముఁడు సింహాసనస్థుఁడై యుండును. ఋషీశ్వరులు, సామంతులు, ప్రజానాయకులు, ఉచితాసనస్థులై యుందురు.)

వశి — లోకారాధ్యులగు నో తపోధనులారా! సామంత ప్రభుసత్తములారా! ప్రజానాయకులారా! నేఁడు మనకు మహాశుభదినము. రాజ్యత్యాగినియైన రాజ్యలక్ష్మి తిరిగి నేఁడు రాజధానికి రానున్నది. ఆ మహాదేవి శుభాగమనమున అరిష్టాకులమై యుండిన సామ్రాజ్యమంతయుఁ దిరిగి సర్వమంగళధామమై భూతల స్వర్గము కాఁగలదు.

(ప్రవేశము- రాజభటుఁడు)

భటు — మహాప్రభూ! లక్ష్మణదేవుల రథము సరయూ సైకతములపై గోచరించుచున్నది!

భరతుఁడు — ఓయీ! శీఘ్రముగఁబోయి నగరమంతయుఁ బుష్పతోరణాలంకృత మగునట్లు చేయుము. నగరమునందంతటను మంగళవాద్యములు మ్రోగవలయును. పురప్రాసాదములపై బహువర్ణ పతాకము లెగురవలయును. పొమ్ము.

(భటుఁడు నిష్క్రమించును)

శ్రీరా — (స్వగ) ఆహా! ఎంతకాలమునకుఁ దిరిగి నాకు సీతాదర్శనము! పుత్రద్వయీ సహితయైన సీత! ఇట్టి మహానంద సమయమున నా హృదయమేల చలించుచున్నది? నా ప్రాణము లేల సమ్మూర్ఛితము లగుచున్నవి? నా చిత్తమేల యమంగళమును శంకించుచున్నది?

(ప్రవేశము — మఱొక భటుఁడు)

భటు — (అభివాదము జేసి) మహాప్రభూ! యజ్ఞాశ్వము వెంటబోయిన సమస్త సైన్యమును, లక్ష్మణదేవుల వెంటఁబోయిన పురజన సమూహమంతయును, వెంటనడువ, రథము వచ్చి యజ్ఞశాల

కడ నాగినది. వాల్మీకి మహర్షి వెంట మహాదేవి పుత్రద్వయముతో, లక్ష్మణ శత్రుఘ్నదేవులు వెంటనడువ నదే యిటు వచ్చుచున్నారు.

(తెరలో మంగళ వాద్యములు — శంఖధ్వనులు — జయజయ ధ్వానములు. క్రమముగ వాల్మీకి, సీత, లవకుశులు, లక్ష్మణ శత్రుఘ్నులు ప్రవేశింతురు.)

సీత—
కుశలవులు — } (శ్రీరామునకును సభకును నమస్కరింతురు.)

శ్రీరా—(అతి సంభ్రమమున) సీతా ! సీతా ! ప్రాణేశ్వరీ ! ఈ యధమాధముని బునరుద్ధరింపఁ దిరిగివచ్చితివా?

(బాష్పములు రాల్చును)

వశి—అమ్మా ! ఇటురమ్మా. ఎంతకాలమునకుఁ దిరిగి నీ దర్శన భాగ్యము లభించినది తల్లీ ! ఇటురమ్మా. ఈ రాజసభా సమాగతమైయున్న మహర్షి సామంత ప్రజాగణము సమక్షమునం దొక్కసారి నీ నిష్కళంకత్వము నుద్ఘోషించుముతల్లీ !

సీత— (ఇంచుక నిస్సబ్దయై, ముఖమెత్తి) నా నిష్కళంకత్వమును దిరిగి యిచ్చట నుద్ఘోషింపవలయునా ?

వాల్మీ— వశిష్ఠమునీంద్రా ! తిరిగి యట్టి యుద్ఘోషణమున కావశ్యకత యేమున్నది ?

వశి— ఋషిపుంగవా ! సూర్యవంశ కళంకక్షాళనమున కది యావశ్యకము.

వాల్మీ— (ఇంచుక తీవ్రముగ) ఏమీ ! కళంకక్షాళనమా ! ఈ జగదేకపావని యీ సభాముఖమునఁ దన నిష్కళంకత్వము నుద్ఘోషించుకొనవలయునా ? వశిష్ఠమునీంద్రా ! ఇంతకంటె హాస్యాస్పదమగు విషయముండునా ?

సీ॥ ఏ మహాలక్ష్మిని ♦ హృత్ సీమ దాల్చి భూ
దేవి వసుంధరా ♦ దేవి యయ్యె !
ఏ పుణ్యనిధి పద ♦ క్షేప భాగ్యమున మా
ర్తాండ వంశము జగ ♦ న్మాన్యమయ్యె !
ఏ మహాసతి దివ్య ♦ నామఘోష మొనర్చి
దండకాటవి ముక్తి ♦ ధామమయ్యె !
ఏ పాపభంజని ♦ శ్రీపాద ధారియై
వీతి హోత్రుండు ప ♦ విత్రుఁడయ్యె !
గీ. అట్టి జగదేక పావని, ♦ యఖిలలోక
పాప కల్మష మేఘ ప్ర ♦ భంజని, యగు
ఈ మహాలక్ష్మి నేమని ♦ యెంచి తార్య,
కల్మష క్షాళనక్రియా ♦ కాండమునకు ?

ఓ పౌరగణములారా! ఓ ప్రజానాయకులారా! మీ యప
రాధ సమ్మార్జనమున కింకను సమయము మించలేదు. ఈ
త్రిలోకపావని క్షమాదానము నిప్పుడైన వరింపుఁడు.
లేదేని, అయోధ్యకు భూచక్రమునందు మరి తావుండదు.

పౌరులు — (ఏక కంఠమున) వశిష్ఠ మునీంద్రా! ఏమియు వలదు.
ఓ జగన్మాతా! మా యపరాధమును క్షమింపుము.

వశి— (వాల్మీకితో) మహర్షి పుంగవా! క్షమింపుము. అట్టి
సత్యోద్ఘాటనమువలనఁ బ్రయోజనము కలదు. మూర్ఖులగు
పౌరజను లిక ముందెన్నఁడును అట్టి నైచ్యమునకుఁ బాల్పడరు.
మఱియు, రాజధర్మ నిర్వహణమునకు ఈ సత్యోద్ఘాటన
మావశ్యకము.

పౌరులు— వలదు. వలదు. ఏమియు వలదు. వశిష్ఠమునీంద్రా!
చాలింపుము.

వాల్మీ— (సీత నుద్దేశించి) అమ్మా! కేవలము శ్రీరాముని యంత
రంగమును బరీక్షించి, ప్రజా హృదయమునందలి సంపూర్ణ

పరివర్తనమును గుర్తించి, నేను నిన్ను నిర్బంధించి యిచ్చటకుఁ దోడ్కొని వచ్చితిని ! నన్ను క్షమింపుము తల్లీ !

ఆ॥ వె॥ రాజశర్మ మింత ♦ రాక్షసంబని సుంతఁ
తెలియనైతి నో స ♦ తీ లలామ !
అమ్మ ! రమ్ము పోద ♦ మాశ్రమంబునకు నీ
పాపరాజ్య భూమి ♦ వదలి యిపుడె !

లవు—అమ్మా ! ఇంక నొక్కక్షణమైన నిచ్చట నిలువఁదగదు. రమ్ము, ఆశ్రమమునకు మఱలి పోవుదము. ఇచ్చటకుఁ బోవలదని నేను ముందే చెప్పియుండలేదా ?

సీత—కుమారా ! శాంతింపుము. తండ్రీ ! శాంతింపుము. లంకా సంగ్రామ విజయానంతరము అగ్నిజ్వాలామధ్యమునందు నిలచి సమస్తభూతకోటి సాక్షిగ ఈవఱకొకసారి నా నిష్కళంకత్వమును నిరూపించియుంటిని. మఱల నీమహాసభా మధ్యమునందు నిలచి యీ సత్యమునే యుద్ఘోషించెదను. ప్రజాహృదయమున సందేహ భంజన మగుఁగాక !

పౌరులు—వలదు. మా కట్టి సందేహమును లేదుతల్లీ ! మమ్ము క్షమింపుము.

సీత—సభాసీనులై యున్న యో మహర్షిగణములారా ! నరేంద్ర సంఘములారా ! ప్రజా సంతతులారా ! అంతరిక్షమునందలి సూర్య చంద్ర గ్రహ తారాకోటులారా ! ఆకాశసంచారులై యున్న దేవతా నివహములారా ! మీ రెల్లరును సాక్షులు ! ఓ రఘువంశమణీ ! శ్రీరామప్రభూ ! తాము సాక్షి !

రా—(వ్యాకుల హృదయముతో) ఆగుము. ఆగుము. సీతా ! ప్రియా ! ఏమియు వలదు. ఈ రాజత్వమును రసాతల నశింపనిమ్ము. ఈ సింహాసనము పాతాళగర్భమున

గూలిపోనిమ్ము. నడువుము. నేను సహితము నీ వెంట నరణ్యగామినై వచ్చెదను.

(సింహాసనము డిగ్గి సీతకడకు నడచును.)

సీత—శాంతింపుఁడు, ప్రభూ! శాంతింపుఁడు!— ఓ చరాచర భూతధాత్రీ! నీవు సాక్షి! నా హృదయాధిష్ఠాన దేవత శ్రీరామప్రభువు! నా యహోరాత్ర ధ్యానమూర్తి శ్రీరామదివ్యమూర్తి! నాసర్వాంగ జీవనశక్తి శ్రీరామశక్తి! నా జీవన తారకమంత్రము శ్రీరామ మంత్రము! సీతా రక్తమాంసాస్థిసర్వస్వమును శ్రీరామ మయము! సత్యము! సత్యము! సత్యము!

(ఆకసమునుండి పుష్పవర్షము కురియును.)

పౌరులు—జై జగత్పావనీ! జై జగన్మాతా! జై!

(పుష్పవృష్టి కురియుచునే యుండును.)

సీత—(నిమీలితలోచనయై చేతులుజోడించి) హే వసుంధరా! సర్వంసహా! జననీ! మహాతాప భయంకరమైయున్న యీ బాహ్యజగతిని నేనింక వసింపఁజాలను. అవమానలజ్జాశోకమయమైన యీ యైహిక జీవన మింక నాకు దుర్భరము! నిరాశాంధకార దుర్గమంబైన యీ ప్రపంచయాత్ర నా కింక నసాధ్యము! ఈ జన్మమునందు నేనింక చేయఁదగు కార్యమేమియును లేదు. ఈ దుస్సహ యాతనను నేనింక భరింపఁజాలను, భరింపఁజాలను. అమ్మా! అమ్మా!

తే॥ గీ॥ సకల చింతా విదూరమై, ♦ సర్వతాప
దళనమై, శాశ్వతానంద ♦ ధామమైన
నీ ప్రశాంత గర్భమున నన్ ♦ జేర్చుకొనవె,
జనని! లోకైక జనని! నీ ♦ తనయ నేను!

(భయంకరమగు ధ్వని వినవచ్చును.)

శ్రీరా— దేవీ! దేవీ! నన్ను నిరాధారునిఁ జేసి వైచి నీ వెచ్చటికిఁ బోయెదవు? ఈ యభాగ్యప్రాణి కింక దిక్కెవ్వరు? నా యపరాధమును క్షమించి నాకు నీసహవాస భాగ్యమీయవా? సీతా! సీతా!

(ఆకసము ప్రళయమేఘావృత మగును. సభాస్థాన మంధకారమయ మగును. భయంకరపవనములు వీచును. సభయందు హాహాకారము లుద్భవిల్లును. భయంకర శబ్దముతో భూమి బ్రద్దలగును. ఆ భూగర్భమునందు సీత ప్రవేశించును.)

శ్రీరా—(ఉన్మత్తునివలె) ఏమిది! ఈ యాకస్మిక ప్రళయ మేఘార్భటులేమి! ఈ యంధకారచ్ఛాయ లేమి! ఈ ప్రచండ వాయువు లేమి! ఈ భయంకర శబ్దమేమి! ప్రళయము! ప్రళయము సంభవించుచున్నది! చేతనాచేతన సమస్త వస్తు సమేతముగ భూమండలము కంపించుచున్నది! అదే! అదే! భూగర్భగోళము! సీతా! సీతా! ఎచ్చట నున్నావు? ఎచ్చట నున్నావు?

సీత—(అర్ధభాగము భూగర్భమునందుండి) మహాప్రభూ! రఘువంశభూషణా! సీతాపతీ! సీతా హృదయాంతర్వర్తీ! నాకింక సెలవిండు. సెలవిండు. నేను నా మాతృగృహమునకుఁ బోవుచున్నాను. నా జనయిత్రి ధరిత్రీదేవి నన్ను స్వాయముగఁ దోడ్కొని పోవుచున్నది! నన్నాశీర్వదించి సెలవిండు ప్రభూ!

శ్రీరా— (మహాదుఃఖమున) దేవీ! దేవీ! నన్నుఁ బరిత్యజించుచుంటివా? నన్ను బహిష్కరించుచుంటివా? ఈ భయంకర జగతియందు న న్నేకాకినిఁ జేసి పోవుచుంటివా?

లవ— } (ఏడ్చుచు) అమ్మా! అమ్మా! మమ్ము మాతృవిహీనులఁ
కుశ— } జేసి పోవుచుంటివా? అమ్మా! అమ్మా!

సీత—ప్రభూ ! దేవాధిదేవా ! రాజ రాజేశ్వరా ! నన్ననుగ్రహింపుడు ! నా యపరాధములను క్షమింపుడు ! జన్మాంతరమునందుఁ దిరిగి తమ సేవాభాగ్యమునకై కాలగర్భమునందు వేచుకొనియుండెదను. ప్రియకుమారులారా ! మీతల్లి కౌటిల్యమును క్షమింపుడు. సర్వాంతర్యామి సర్వేశ్వరుఁడు నా హృదయఘోషము నెఱుంగును. కులభూషణులు కండు ! వంశవర్ధనులు కండు ! ఓ రాజర్షి నరేంద్ర సంఘములారా ! ఓ ప్రజాగణములారా ! తండ్రీ, వాల్మీకి మహర్షి చంద్రమా ! గురుదేవా! వశిష్ఠమునీంద్రా ! నా యంతిమ నమస్కారమందు కొనుడు.

(గొప్పధ్వనిపుట్టును. సీత భూగర్భమున నదృశ్య యగును. ఎప్పటియట్ల ప్రకృతి శాంతించును.)

శ్రీరా—(దిగ్భ్రమఁజెంది) ఏదీ? ఏదీ? నా జీవనజ్యోతి యేదీ ? ఏదీ నా సహస్రజన్మ తపఃఫలము ? నా యర్ధాంగలక్ష్మి యేదీ?—లక్ష్మణా ! ధనుస్సు ! ధనుస్సు! నా ధనుర్బాణముల నిమ్ము. నా మనః ప్రాణ సర్వస్వహారిణియైన యీ భూగర్భమును భేదించెదను. సప్త పాథోరాసుల నింకించి తలాతల రసాతల గర్భకుహరంబులను బహిర్గత మొనర్చెదను. గర్వోన్మత్తమైయున్న యీ పంచభూతాత్మక ప్రపంచమును నిశ్శేష మొనర్చెదను. చతుర్దశ భువనములను భస్మీభూత మొనర్చి యీ నిస్తేజ భస్మరాసినుండి నా జీవనరత్నమును బెల్లగించెదను. సీతా శూన్యమైన విశ్వగోళమును శ్రీరామాస్త్రహుతాశనార్చి క్షణమాత్రము సహింపఁజాలదు. సూర్య చంద్ర నక్షత్ర కోటి చిద్రుప చిద్రుపములై యంతరిక్షమునుండి రాలి పడవలెను. చరాచర బ్రహ్మాండము ప్రాణిశూన్యమై యంధకార

గర్భమునందు లీనము కావలెను. తెమ్ము, నా యపరాజిత కోదండము నిటు తెమ్ము.

( ఉన్మాదించును. )

వాల్మీ—(శ్రీరాముని చేతులుపట్టుకొని) వత్సా ! రఘువంశవర్ధనా! శాంతింపుము. శాంతింపుము.

మాయామానుష మూర్తివై జగతి జ ◆ న్మంబంది సంసార మా
ర్గాయాసంబున విస్మరించితివె, తా ◆ ద్యజ్ఞాన సర్వస్వమున్ !
స్థాయింజెందుదునె దుర్నివార ఘటనా ◆ చక్రంబు ! సర్వేశ్వర
శ్రీసుస్సాంద్రపదంబు మీరవశమే ◆ శ్రీరామ చంద్ర ప్రభూ!

శ్రీరా—(మహాదుఃఖమున) హా ! సీతా ! సీతా ! సీతా !

(మూర్ఛిల్లును; తెరవ్రాలును.)

---

సంపూర్ణము.